# మనవి.

నాకు జన్మాదిగ డెబ్బదియొకటవ సంవత్సరము గతించుచున్నది. గత కాలమును సింహావలోకన న్యాయమునఁ బరిశీలించిచూచితిని. బంగారమువలె విలువగల యింతకాలము వ్యర్థముగఁబోయినది. విచారించిచేయునది యేమున్నది. యికనున్నకాలమత్యల్పము, దీనినైన సార్థకమొనరింపఁగోరిక గాఢమైనది. యిది యెట్లు సాధ్యమగును. యింద్రియములు, విషయ సుఖలోలములు. వైరాగ్య మనుదినము, హృదయశుద్ధము, భగవద్ధ్యాన క్షమము, ధనమును, సద్వ్యయమొనర్చుటకు నా జీవితకాలమున గుర్తిగనవ్వనైన నిలువజేసియుంచలేదు యింకయు ఋణభారమొకటి కలదు త్యాగబుద్ధి లేదు. పెద్దలనాశ్రయించి ప్రపత్తి శాస్త్రము నభ్యసించెదమనినఁ నహంభావము తొలగనివ్వదు. వయః కాలమున విద్యనార్జించుటకు కుటుంబపోషణాభారసగ్రము నిషతన మడ్డు దగిలినది. విస్మృతిదూషితబుద్ధి, గురుకృపార్జితజ్ఞానలేశమును పూర్ణముగ తుడిచివేసినది. మరియు నాశాపాశనిబద్ధమైనది.

యికనేమిగతి. సంకల్పమొకటి నెరవేరినను అన్యత్రోపాయము నెఱుగని జన్మమునకు ఫలమేమిగలదు. మనుష్యజన్మముఁ బొందియుఁ బశుపక్షితుల్యముగ వర్తించవలసి వచ్చినది. వంశపరంపరాగతులగు శిష్యజనులు, మిత్రులు, నావలన విశేషజ్ఞానము నార్జించ నభిలాషలు గలవారై యుండిరి.

మా వెనాయముల వారి ద్రవ్యము నపహరించుటయేగాని నా వలన వారికేమియు నుపకారము గలుగలేదు. యిదిగూడ నామనస్సును పీడించినది యేమియుఁ దోచలేదు. గాని యదృష్టవశమున సంస్కృతమునను తెనుగునను పద్యమును సురూపముగ గాకున్నను కురూపముగనైన నల్లుట యొకటి లభించినది. దానినుపయోగించియైన నా శిష్యులకును మిత్రులకును నాజన్మమునకును, యేమాత్రమునైన నుపకరింపఁ జేయదలచితిని. దానికి ఫలరూపముగ నీ గ్రంథము నిష్పన్నమైనది గాన ప్రాజ్ఞులనిందలి దోషములఁ బరికింపక గుణలేశములకానందింపఁ గోరుచున్నాడ.

శనివారప్పేట,
ఏలూరు తాలూకా.
7—7—1939.

ఇట్లు,
తిరుమలై యచ్చాన్ కాండూరు వేంకట
తిరుమలాచార్యులు అయ్యవార్లు.

శ్రీరస్తు.

శ్రీ గురుభ్యో నమః

# భరతచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

ఉ॥ శ్రీవసుధాత్మజాధిపుని చేతనసృష్టికి బాలభూతుఁడా
ర్తావన దీక్షితుండు రఘురాముఁ డమాయికవర్తనుండు వే
దావళిలోని తత్త్వము నుదారచరిత్రను జూపువాఁడు మ
ద్భావుక దానకల్పకము భద్రములిచ్చును మాకు సత్కృపన్॥ ౧

ఉ॥ శ్రీరఘురామ వారిదము సేవితభద్రశిలోచ్చయంబు సీ
తారమణీతటిత్ప్రభము తాదృశరత్నవిభూషణప్రభా
భారసురేశ చాపము విభాసురమాత్మల సద్గ్రయూరనా
సారసుహృత్తిభక్తజన చాతకి మెప్ప నభీష్టవర్షి సుగా॥ ౨

ఉ॥ ఎవ్వఁడు సర్వరక్షణ మనీషను పాండవదూతయై సభన్
నెవ్వము లేసి భద్రయుత సన్నయ మొప్పఁగఁ బల్కి పెద్దల
న్నివ్వల సంతసిల్లఁగను జేసెనొ దుష్టుల బాలనాడి యా
కవ్వడి సంగడీఁడు మము గంజదళాక్షుఁడు గాచునెప్పుడున్॥ ౩

మ॥ నిజసంశ్లేషము చేత నచ్యుతునకే నిర్వ్యాజసుశ్వా
త్వసుకీర్తిం గలిగించి లోకజననీత్వఖ్యాతి దానొంది భ
క్తజనాభీష్టఫల ప్రదాయిని రమాకాంతాభిధానాఖ్య సం
పద్మజగ్రాదినిలింప వంద్య గుణ నాకిచ్చు సిద్ధార్థముల్॥ ౪

శా॥ భాషాధీశ్వర ముఖ్యసూరి పరిషద్భద్రాను సంధాయియై
శేషావ్యక్తను మిత్రబృంద యుతుఁడై సేనాసముల్లాసియై
శేషంబున్నిజ వేత్రచాలనపటిం జెన్నొందఁగాఁ జేయుచుం
శేషింగొల్చెడి వేత్రధారికి సదాసేవల్లగస్సైసెదన్॥ ౫

గీ॥ ఎవనిసారస్వత స్రోత మెంచిచూడ
వరగుణవకుళామోద సువాసితంబొ
వేద మచ్చటనియతితో వేడ్కనిలచె
నట్టిశఠకోపముని చంద్రు నాశ్రయింతు॥ ౬

చ॥ గురువుల సన్నిధానమున గూర్మిని విద్యలనేర్చబోక్ష ణ్మె
పరమతివేద శాస్త్రముల వాదమొనర్చి జయించివక్త్రి ల
న్నరపతిబద్ధ సుల్కమును నాణెముగాఁగొని భక్తిజక్రికి
న్వరసుతనిచ్చి మామయగు వానిని గొల్చెద విష్ణుచిత్తునిన్॥ ౭

మ॥ కలిదోషంబున ధర్మవిప్లవము గల్గంగాంచి శేషాహిం లో
కులగాపాడఁగ, వేదవేద్యుఁడగు వైకుంఠేశు పూర్ణాజ్ఞచే
నిల రామానుజుడై జనించికలి, మోహీంభూతులం దేర్చి శ్రీ
లలనాధీశ పరత్వమున్నిలిపె నాలంబింతు తత్పాదముల్॥ ౮

సీ॥ సంకీర్ణ వేద వాక్సందేహముల బాప, సద్జ్ఞానసారంబు సరవినిడియె
విమలతత్త్వార్థము విశదంబుగావించి, సరసప్రమేయాఢ్య సారమిడియె
రామానుజాచార్య రమణీయకారుణ్య, లబ్ధాసనంబున లసితుడయ్యె
శ్రీభాష్యమును జేయు శ్రీభాష్యకారుల, కతిభక్తిసాయంబునమర జేసె॥

గీ॥ సమరయాదునిజ్ఞమై జెల్లు నవనిలోన
పరమమాచార్య పురుషాఖ్య పదముదనదు
వంశ్యులకు సరి శిష్యుల వాసినిచ్చె
నట్టియజ్ఞార్యమద్వంశ్యు నాశ్రయింతు॥ ౯

చ॥ కరములనెత్తి మ్రొక్కెదను కాండురి రాఘవదేశికోత్తమున్
వరదుని శేముషీవిజిత వాసవదేశికు వేదవిద్వశం
పరహితచింతనైకరతు పంకజనాభపదాబ్జభృంగునిం
గురుని పరావరజ్ఞు నిజగోత్రమహత్త్వగ తాశపాదునిన్॥ ౧౦

గీ॥ శబ్దగగన చరగణిత శాస్త్రతతుల
కావ్యనాటక నిగమాంత గణమునెల్ల
గరుణదెలిపిన గురువుల కలితయశుల
బరమభక్తిని గొలిచెద భవ్యనిష్ఠ॥ ౧౧

చ॥ కవులకునెల్ల నాద్యకవి కారుణికాగ్రణి భారతీకృపా
భవదనవద్యరామ నృపభవ్యతరాదిమ కావ్యకల్పనున్
భువనమునిండుకీర్తియును భూమిజమెప్పును గల్గువాఁడనా
కవితను వామలూరుజుడు గాచునసంతదయా వశంబునన్ ౧౨

గీ॥ భారతముజెప్పి యామ్నాయ భరముబాపి
శ్రుతులసూత్రించి శోధించి సూక్ష్మగతుల
భాగవతయోగటీకల బరగజేసి
బరగువ్యాసాఖ్య బరమాత్మ భక్తిగొలుతు॥ ౧౩

గీ॥ కాళిదాసుని భవభూతి కల్హణాఖ్యు
బాణుబిల్హణు భారవి భవ్యభోజు
మాఘుహర్షుని దండిని మదినిదలతు
కావ్యనిర్మాణ ముఖమున కరముభక్తి॥ ౧౪

ఉ॥ మన్ననగల్గు నన్నయనుమాన్యుల తిక్కన నాచసోములన్
సన్నుతుఁ బెద్దనార్యకవి సత్కవిబమ్మెర పోతనార్యు వి
ద్వన్నుతు రామరాజకవివర్యుని భీముని ముక్కుతిమ్మనన్
మన్ననజేతు నామదిని మామకకావ్య ముఖంబునందుసన్॥ ౧౫

గీ॥ అంతటను హరి పూర్ణుడై యలరియుంట
నెవరినైనను దూషింప నింపుగాను
వినయ వినమిత కరయుగ్మ విలసనమున
భజన జేసెద హరిదృష్టి భవ్యులన్న॥ ౧౬

క॥ సుకవులను స్తుతిజేతురు
కుకవుల నిందింతురెపుడు కూఁటిమి విబుధుల్
సుకవులకు కుకవులకునే
ముకుళించెద చేతులెపుడు మురహరుబుద్ధిన్॥ ౧౭

క॥ వారలు వీరలు కవులే
వీరలలో వారిలోన వేరా నేనున్
వారికి వీరికి నతులను
వారితముగ విష్ణుబుద్ధి వాసిగ జేతున్॥ ౧౮

గీ॥ అందరును కవిరాజులై యలరలేరు
కర్మకృతమగు వైషమ్యకలన వలన
తారతమ్యంబు గలుగును తథ్యముగను
గాన సద్విధి హరికృప గాంచవలయు॥ ౧౯

గీ॥ కాళిదాసుని కావ్యముల్ గలయజూచి
కవులు కవితను విడనాడ గలిగినారె
గరుడ గమనంబు గనుగొని కాకి తనదు
గతిని విడనాడి గద్దెక్కి గనగ గలదె॥ ౨౦

సీ॥ అందల మెక్కెడి యధిపుని గనలేక వాహకులాతని వదలగలరె
రాజ్యము పాలించు రాజును గనలేక పాలితు లాతని బాయగలరె
తనకంటె యధికుడౌ దన భర్త గనలేక కులసతి యాతనిగూడకున్నె
ధనము మిక్కిలిగల్గు ధనికునిగనలేక దమకుండు ధనమునుదాచబోరె

గీ॥ పూర్వభవమున జేసిన పుణ్యమునకు
దగిన యిష్టాల సకలంబు దనకు గలుగు
నందకుండెడి దానికి నరుగనేల
గనుక దనకుంట యవసంబె కాంచనంబు॥ ౨౧

గీ॥ ఆంధ్రమందైన సంస్కృతమందునైన
పూర్వులను బోలువారలు బుట్టబోరు
వీర్యమునయైన శస్త్రాస్త్రవిద్యనైన
పూర్వులను బోలు రాజులు పుడమిలేరు॥ ౨౨

క॥ కవిజెప్పిన కావ్యంబుల
జవిజూచి బుధుండు దాని సరసతగూర్చున్
భువనమున బుట్టు దామర
నవరించును రుచులగూర్చి సవితయె మిగులన్॥ ౨౩

గీ॥ కనుక శక్తికి తగినట్లు కమలనాభు
కధను వర్ణింపగడగితి కరముభక్తి
భక్తి నెప్పుడు భక్తను పడతి దగిలి
చేతనైనంత సేవను జేయునట్లు॥ ౨౪

చ॥ కవనము పూర్వపుణ్యమున గానిలభింపదు లబ్ధమైన శ్రీ
ధవపద పద్మ సంస్తుతి విధానమునన్ గడతేరగావలెన్
భవము దొలంగజేయు నిరుభక్తి లభింపదు లబ్ధమైన శ్రీ
ధవపదపద్మ షట్పద విధంబున నిత్యము నిల్వగావలెన్॥ ౨౫

గీ॥ ప్రతిభయును లేదు పాండితీ పటిమలేదు
శబ్దశాస్త్రాది విధులను జదువలేదు
కావ్యమొనరించగల శక్తిగలదె నాకు
బుద్ధి చాపల్య మిట్టుల బూనజేసె॥ ౨౬

గీ॥ కావ్యమును జెప్పగల శ క్తి గలుఁగకున్న
శబ్దశాస్త్రాది విధులను జదువకున్న
పరమపావన గురుకృపఁ భవ్యరీతి
కావ్యకల్పన జేయించగలదు నేఁగ॥ ౨౭

చ॥ కవితయు కాంతయున్స్వయముగా వశవర్తిని నైనహాయిగా
భువనమునందు కీర్తియును భూరి సుఖంబును గల్గు లేని-చో
నవమతి గష్టపెట్టు చటులార్భటి వశ్యను జేయఁబూనినన్
చివరకు లోకనిందయును చేకురు సౌఖ్యములేదు లేశమున్॥ ౨౮

చ॥ కృతమతిమారుతాత్మజుఁడు కృత్తనిశాచరుఁ డబ్ధి దాటఁగా
మతి చెడి మూఢవానరుఁడు మానుగ నబ్ధిని దాటఁగోరిన
ట్లతులిత శక్తివంతులగు నాంధ్రకవీంద్రుల కావ్యకల్పమౌ
కృతిని రచింపఁబూనితిని కేవల చాపలతావశంబునన్॥ ౨౯

మ॥ వరవల్మీక భవాభిదాన కృతమౌ వస్తూత్తమంబుండఁగా
పరకావ్యంబుల గాంచువారు గలరే భావ్యంబె భావించు మీ
విరసంబీ శ్రమయన్నచో హరికృపా వీక్షా విశేషాత్తమౌ
వరవాగ్బ్రహ్మము నేమిజేయవలయునవ్వర్ణింపుఁడీ సద్బుధుల్॥ ౩౦

ఉ॥ మైనపుతెట్టెయందు ఘనమై విలసిల్లుచునుండు పుర్వులన్
గానమెయట్లుచేతనులు గ్రాలుచునుండఁగ మాయయందునన్
మానుగ నద్దయాకరుఁడు మంజులదేహము లిచ్చిగాచె నా
దీనదయాళుడౌ హరిని ధీరులుగొల్వక యుంటబాడిరో॥ ౩౧

చ॥ పలుకఁదలంప దుష్కరము భావుకరామ చరిత్రముర్వరన్
లలితము వాసములూరుజ విలాసవచోమృతపూరితంబు భా
సిలెడియరంటిపంటిరుచిచే విలసిల్లెడి యాంధ్రభాషనం
కలనముజేతు నీభరత క్రమచరిత్రము కావ్యపేటికన్॥ ౩౨

గీ॥ పరమపావనమైయెప్పు భరతచరిత
పారిజాతసుమము భక్తి బరగనిడుదు
రామచంద్రుని పాదుకారాజమునను
దానధన్యుడనయ్యెద ధర్మసరణి॥ 33

గీ॥ భరతుడెప్పుడు సీతేశపాదయుగళి
న్యస్తసర్వస్వుడై కీర్తి విస్తరించె
భరతచరితము సీతేశ పాదయుగళి
న్యస్తసర్వస్వమైకీర్తి విస్తరించు॥ 34

గీ॥ వేదవేద్యుడు రాముడు వేదమరయ
రామచరితంబు భరతుడు రామచంద్రు
సోదరుడగుట నర్చింతు సొంపుగాను
భరతచరితంబు రాముని పాదములను॥ 35

సీ॥ ఆటపాటలయందు నాశలేశములేదు యర్థమార్జించుట యసలె లేదు
పొరిగిళ్ళదిరుగుచు బ్రొద్దుబుచ్చుట లేదు పరదోషముల నెంచు పటిమ లేదు
కన్నులు గనకుండ కర్ణములు వినకుండ జేసెడి విత్తంబు జేరలేదు
స్థిరమైన వసతియు తినుటకించుక జాలి తెగుకీతిదినములు తినరుచుండె

గీ॥ మనసు నీయందు మఱగెను మమతతగ్గె
కవిత యించుక నీకృపచే గలిగెనాకు
కాలమికనీవు కథలను గడుపగలను
రామ రఘురామ శ్రీరామ రామ రామ॥ 36

సీ॥ ఇలుదిద్దుకొనజాలు యింతి యింపుగనుండ భయభక్తి బుత్రులు పలుకువినగ
బంధుగులందరు బరమాదరంబున పరమాప్తులై ప్రేమ బలుకుచుండ
మిత్రులు మిక్కిలి మేలుగూర్చుచునుండ బోధించ శిష్యులు బూనియుండ
సకలేంద్రియంబులు సరసంబుగానుండ దేహదార్ఢ్యము దివిరియుండ

గీ॥ మనసునీయందు మగ్నమై మసలుచుండ
నింత నీవిట్లుగలిగింప నిపుడె నేను
కాలమంతయు నీస్తుతి గడుపవలదె
రామ రఘురామ శ్రీరామ రామ రామ॥ ౨౭

చ॥ భరతుడు ధర్మమార్గమున భక్తవిరక్తుల నిపుడు మెచ్చగా
తరుణిని రాజ్యము స్సురుల తల్లులవీడి తపోనివిష్టుడై
వరభవ దీయపాదుకల వాసిగగొల్చుచు నీవు వెండియున్
ధరణిని గాచుభారమును దాల్చెనుదాకి వసించెబల్లెలో॥ ౨౮

ఉ॥ కానకుబోవవచ్చు ఘనకష్టములెన్నియొ బొందవచ్చు నం
ధానముజేసి బాణముల దైత్యుల గొట్టగవచ్చు ఘోరులౌ
కానగదూరవర్తులగు కాంతను బంధుల వీడవచ్చు స
న్మానిత రాజ్యభోగముల మానెడివాడు గలండెభూమిలో॥ ౨౯

చ॥ భరతునివంటి సోదరుడు భక్తుడులేడని భవ్య సత్కృపా
న్గరమనురక్తి నీచరణ కంజములందున నుంచినావు నీ
కరుణకు పాత్రమై యశముగాంచి రహించుమిలు గల్గుదాక స
ధరణిని నిల్పుమీకృతిని ధర్మవిధిజ్ఞులు మెచ్చ రాఘవా॥ ౩౦

ఉ॥ తమ్ముని యందు నీకుగల తాదృశ సత్కృప నెంచినేను నీ
దమ్ముని పేరుబెట్టితిని తమ్మునిమారుగ జూతువంచు నీ
తమ్ముని నన్ను నీసతిని తథ్యముగొల్వగ బూనియీకృతిన్
నమ్మితి నీపదాబ్జయుగ సన్నిధిజేర్చితి గావవే కృపన్॥ ౩౧

మ॥ నిను సేవించుటకెంతొ భక్తవరుడౌ నీతమ్ము సేవించు టే
ఘనమౌ నీదయ గాంచుమార్గమని నే గాఢంబుగా నమ్మినీ
యనుగుం దమ్ముని పేరుబెట్టితినిగా కానంద సంధాయి నీ
ఘనచారిత్రమె యిద్ది వేరుగలదే కంజాత పత్రేక్షణా॥ ౩౨

సకలపు శ్రీరామచంద్ర పాదారవింద విన్యస్త సర్వభారుండనై భానుకులాలంకారు భగవంతుని శ్రీరామచంద్రమూర్తియే యేతత్ప్రబంధ సిద్ధాంత గ్రంథ పరిసమాప్తి ప్రచయ గమనంబులకు ప్రధాన కర్తయనియు నా యుమాత్ముని కరుణాకటాక్ష వీక్షణాను సారంబుగ నెల్ల గావలయునో యట్లనే యగుంగాక యనియు దలంచి నిశ్చింతుండనై శక్త్యాశక్త్యంబుల గణింపక సాహసంబున ప్రబంధ రచనా కుతూహలాయత్త చిత్తుండనై మఱియు సంక్షేప క్రమంబ బ్రవర్ణించెద.

మ॥ హరినాభీరుహ జన్మమందున మహాపాద్మంబునన్బుట్టి శ్రీ
కరలోకత్రయ సృష్టి జేసి పురుహూత త్వంగిరో ముఖ్యులౌ
పరమార్షుల తండ్రి పద్మజుడు సత్ప్రఖ్యాతి పాత్రుండు భూ
సురదేవార్చిత పాద పంకజుడు ఔశ్లోకభావమ్ము చెప్పుచున్॥ ౨౧

గీ॥ ఇట్టి పద్మజపుత్రుల కేడ్వురకును
శ్రీ భరద్వాజముని వరశేఖరుండు
సప్త సామములందున సవతులేని
సరసమైన రథంతర సామమట్లు॥ ౨౨

గీ॥ ఆభరద్వాజముని పరమధార్మిక యగుచు
వేద వేదాంత విదులను విప్రవరుల
తద్విశారద సంఘముల తత్వవిధుల
వర్ధనముల పాలిట యమృతరుల॥ ౨౩

గీ॥ కనియెవారలు కాలాన కలితకీర్తి
కమ్రగుణపంక్తి కార్య సంకలితమైన
వరగనోచ్చారి శాఖల భవ్యగతుల
బహువిధంబుల బరగిరి భరత భువిని॥ ౨౪

మ॥ పదిభేదంబుల నొప్పి భూసురులు సద్భావంబుల న్దుల్యులై
సముదాయంబుగ గౌడు లద్ద్రావిడుల న్నొప్పు న్స్వవిద్యాతతిన్
మది నూహింప నశక్యులై మహిమచే మత్తేభ పంచాస్యులై
యిపుమిద్ధంబను తత్త్వమున్దెలసి వారింపొంది రుర్వీస్థలిన్॥ ౮౭

సీ॥ అందు ద్రావిడులు రాజిల్లి రైదుగతుల
ఆంధ్ర ముఖభేద భిన్నులు హర్షయుతులు
వేద వేదాంగ శాస్త్రార్థ విత్తములను
వివిధవిధ ధర్మవేత్తలు విశ్వవిదులు॥ ౮౮

వ. ఆంధ్రులు ద్రావిడులు కర్ణాటకులు మహారాష్ట్రులు ఘూర్జరు
లను భేదంబుల ద్రావిడ బ్రాహ్మణు లొప్పుచున్నవారు. అందు
ద్రావిడులలో కాండూరు వంశమున పుదుప్పులీయను పురంబున,

సీ॥ విప్ర విహితంబులగు యజ్ఞ వితతినెల్ల
విధివిహితముగ జేయుట విశ్వమందు
నర్థ యుతమైన యజ్ఞమూర్త్యాఖ్యబడసి
నాటె నుత్తేభ సింహమై వరలుచుండె॥ ౮౯

క॥ కాండూరు యజ్ఞమూర్తికి
పాండిత్యమునందు సాటి భాషాపతియే
కాండూరు యజ్ఞమూర్తియె
కాండజ్ఞప కాండహరుడు కాండజ సముడున్॥ ౯౦

సీ॥ అతని శిష్యులు శాస్త్రము లధిగమించి
యవని నెల్లెడ దామెయై యద్ధకీర్తి
గలుగజేసిరి గురునకు గాఢభక్తి
సతతముగ ర్వాద్రి నవలీల నధివసించె॥ ౯౧

వ. అంత నొకనా డతడు

శా॥ శ్రీరామానుజ కీర్తి చంద్రికలచే జన్నోన్నం దిక్స్వేతాభవా
పారావార పరీత భూవలయము న్యాపించి యజ్ఞార్యుడా
శ్రీ రామానుజ యోగిపుంగవులతో శీఘ్రిం బసానెంపగా
శ్రీరంగంబున కేగుదెంచె జయ కాంక్షీభూప చేష్టన్ముకై॥ ౫౨

వ. శ్రీరంగ క్షేత్రంబున శ్రీరంగనాథుని సేవించి

క. రంగని మంటపమందున
సింగంబుల మధ్యరాజ సింహాసము మూడ్కిం
సంగత బుధుడగు లక్ష్మణ
పుంగవుగని వాదసరణి భోరున బలికెన్॥ ౫౩

క. రామాను జార్యవినుమీ
సామాన్యుల గెలచియింత సంతసమేలా
నా మారువారె వీరలు
నీమానము దక్కదికను నిజమిదిసుమ్మీ॥ ౫౪

క. నీయుక్తి లతలగోయును
నాయుక్తి లవిత్రమిపుడె నమ్మము విప్రా
ధీయుక్తిని యోచింపుము
భీయుక్తుడవైన బొమ్ము భిక్షుకు నెటకో॥ ౫౫

క. శంకర సిద్ధాంతముని
శ్శంకగ నిలుపంగనేను శక్తుడ నగుటన్
బింకము లిచ్చట సాగవు
పొంకముగా లేచిపొమ్ము పోరగ గలవే॥ ౫౬

క॥ వేదంబుల శాస్త్రంబుల
వాదింపగ జాలువారు వసుధం గలరే
భేదంబు నిలుపలేవిక
వాదింపగ నేలబొమ్ము వనమున కిపుడే॥ ౫౭

వ॥ అని తనకు విశ్వాస పాత్రుండగు శంకర మతపక్షపాతంబు-నను స్వీయ పాండిత్య విశిష్ట గర్వంబునను యజ్ఞార్యుండు యతిపతి నవలోకించి సాక్షాత్పరమేశ్వరాంశ సంభూతుండగు శంకరాచార్య వర్యుండు వక్కాణించిన శంకరాద్వైతమె పరమ సిద్ధాంతము. దానిని నేను పరిష్కృత యుక్తుల సమన్వయ మొనర్చి సరసంబుగ పరమత నిరసన పూర్వకముగ బోధించి సిద్ధాంతమును జేయగలను. మీరును నేనును వాద ప్రతివాదముల నొనర్చునెడ నొకవేళ నేనే జయముండ సైతినేని మదీయ పూర్వాశ్రమ పుత్రులతోడను మదీయాంతరంగ శిష్యులతోడను మీకు శిష్యుండనయ్యెద. మనవాదంబునకు పదునెనిమిది దివసంబులు పరమావధి యనిబలికె. లక్ష్మణయతి సార్వభౌముండు యజ్ఞమూర్తి వచనంబుల కలరి "సాధుసత్తమ! భవదీయ ఛందానురోధంబుగ నేనును సమ్మతించితిని. నేను మీకుతగిన సమాధానముల చెలుప లేకుంటినేని పరతత్వ నిర్ణయ ప్రవృత్తినిమాని తద్విహితగ్రంథరచనను విసర్జించెద" నని వచించిరి. అంత యిరువురును తమతమ వాదంబులకు తగిన సంభాషణంబుల నొనర్చుకొనుచుండిరి. అపుడు యజ్ఞార్యుండు సంపూర్ణ చంద్రుని కబళింపబోవు సైంహికేయుని యట్లు స్వమత సన్యాసము నిట్లు పలుక దొడగెను.

సీ॥ 'బ్రహ్మంబుసత్యంబు బ్రహ్మమె మాయనుజేరగ జీవుడై చెలగుచుండు
గావున జగమెల్లగను గాన మిథ్యయె భ్రాంతిని నిజమన బరగుచుండు
బ్రహ్మ విజ్ఞానంబుబడసిన జీవుడు బ్రహ్మమై యొప్పును ప్రబలముగను
జ్ఞానంబె మోక్షము జక్కగగూర్చును తత్వమసియొకటె తగినదారి॥

గీ॥ భ్రాంతిరజ్జువు సర్పమై ప్రబలినట్లు
మిథ్యజగమున దోచును తథ్యబుద్ధి
ఘటమునందలి గగనంబు ఘటముబగుల
పూర్ణ నభమున జేరును తూర్ణముగను॥

సౌ

గీ॥ అహాహా పహాయనను వీడిన యమలతముడు
తత్వమస్యాది వాక్యార్థ గతత్వమరసి
నిర్గుణబ్రహ్మ విజ్ఞాన నిరతుడగుచు
నాశ్రయించును బ్రహ్మ ననన్యగతిని॥ ౫౯

గీ॥ స్వప్నమునదోచునది యెల్ల స్వప్నహీన
కాలమునెనట్లు మిథ్యగ గనునో మనుజు
డజ్ఞదశయందు గనుచున్న యఖిలజగము
మిథ్యగాదోచు జ్ఞానికి తథ్యముగను॥ ౬౦

గీ॥ వేదశాస్త్రపురాణాది వివిధకళలు
ప్రథమదశయందు ముఖ్యత్వబడసియుండు
జ్ఞానికివియెల్ల మిథ్యలు సర్వవిధులు
సర్వకర్మలు జ్ఞానికి జరుపదగవు॥ ౬౧

గీ॥ నిత్యవస్తువు పరమాత్మ నియతముగను
సతనికింటెను మరియేది యసలెలేదు
గానన ద్వైతసిద్ధిని గనినవాడు
నిర్గుణబ్రహ్మయగు సుమ్ము నిశ్చయముగ॥ ౬౨

క॥ వాదముచేయగ శాస్త్రము
వేదముదగియుండుగాని వేఱరికిపన్
గాదుసుమీ పరమార్థము
లేదుసుమీ బ్రహ్మకంటె లేశముపరమున్॥ ౬౩

గీ॥ కర్మనోసరింపగలుగును కర్మపులకు
జ్ఞానమంతటకర్మ సంసక్తివిడచి
సన్యసించుచు వైరాగ్య సక్తుడగుచు
మోక్షమొందును బ్రహ్మమయా మోదమునను॥ ౬౪

గీ॥ నామరూప విహీనస్సై నాణెముగను
నిర్గుణబ్రహ్మయల రారు నిశ్చయముగ
గనుల కగుపించునదియెల్ల కల్లయగును
బ్రహ్మమంతట పూర్ణమై ప్రబలియుండు॥ ౬౫

వ॥ అను మొదలగు ప్రబలమను సహేతుకోపపత్తుల నుగ్గడించుచు సకల శాస్త్రంబులను సర్వ నిగమంబులను స్వమతానుకూలంబుగ సమన్వయించుచు నత్యుక్తి ఛలోక్త్యాదుల నతి బహు ప్రగల్భంబుగ కుతర్క ఘోరనాదంబు చూపుచు సభాస్థిత మహా విద్వాంసు లందరు నిర్విణ్ణులై యుండునటుల ఘోరంబుగవర్షించు వార్షిక మేఘంబునగిది ప్రసంగించె.' యతి సార్వభౌముడు పిమ్మటంగవు నవలోకించి ప్రతి తర్కంబుల నాతని వాదమూకత నాపి శాంతంబుగ చిరునగవు నవ్వుచు దగిన సమాధానంబుల నుడువుచు 'విప్రోత్తమ! బ్రహ్మజ్ఞానానందమయుడని యంగీకరించి నామ రూపంబులు లేవనుట పొసగదు. నిర్గుణ శ్రుతులకు హేయగుణ రాహిత్యంబును సగుణశ్రుతుల కనంత కళ్యాణ గుణాకర త్వంబును నర్థంబుగాని మీ రుపపా దించునది యర్థముగాదు. జీవేశ్వరుల కైక్యంబు బలికిన పరాత్పరత్వంబు పరమేశ్వరునకు లేకపోవును. ఈశ్వరోత్పత్తి లయ యంగీకారంబున వేద శాస్త్రంబులు వితథంబులగును. జగంబునకుమిథ్యాత్వం బంగీకరించిన వేద వేదాంతంబులకును సకల స్మృతులకును మిథ్యాత్వంబుసంభవించు. అట్లాని ననుమతించిన భవదీయ వేదాధ్య యన తదనుష్ఠానాదులు వ్యర్థంబులు వేద శాస్త్రంబులు హేయగుణ రహితుడు సౌశీల్య సౌలభ్యాది సకల సద్గుణాశ్రయుడు సర్వేశ్వరుడు సర్వ నియత సర్వవ్యాపియగు శ్రియః పతిని పరాత్పరునిగ వచించు చున్నవి. జ్ఞానానందాది గుణములు కల ఘనియూ బ్రహ్మయనియు నుడువుమీరు నామధేయ రూపధేయంబులు

బ్రహ్మకు గలవనవలెను. ఘటాకాశంబు మహాకాశంబున గలయు భంగి జీవులు బ్రహ్మంబున గలియుదు రనతగదు. జీవులు భగవచ్ఛేషభూతులు బహు సంఖ్యాకులు. బ్రహ్మవలెనె నిత్యులు. ప్రకృతియు నిత్యము. త్రైగుణ్య విషయములగు శ్రుతులకు శుద్ధసాత్త్విక శ్రుతుల విమర్శనంబున ప్రామాణ్యంబు వక్కాణింప నగును. భవత్కథిత రజ్జుసర్ప భ్రాంతియు పొసగదు సత్యంబు జ్ఞానము సత్య సర్పజ్ఞానము గలవానికి యుపాధి వశంబున భ్రమగలిగిన గలుగును సర్పరజ్జు జ్ఞానము లేని వానికి యట్టి భ్రమగలుగ నేరదు. మీకు జగము మిథ్య తదంతర్గత సర్ప రజ్జువులు మిథ్యలు. ఈ మిథ్యాపరంపరలతో సత్యజ్ఞానమును మీరెట్లు సాధింపగలరు. బ్రహ్మను ప్రకృతి బంధింపనేరదు. అట్లు బంధించిన సర్వేశ్వరత్వము సర్వశక్తిత్వము సర్వ నియంతృత్వము బ్రహ్మకు లేక పోవును. బ్రహ్మజ్ఞానముగల జీవుడు బ్రహ్మజ్ఞానియగునుగాని బ్రహ్మ గానేరడు. జ్ఞానకర్మ సముచ్చయమె మోక్షసాధనము. కేవల జ్ఞానము మోక్ష సాధనము కానేరదు. మీరు వేదనిత్యత సంగీకరించరు. వేద నిత్యత నంగీకరించిన మీరుపపాదించు నద్వైతమునకు భంగము వాటిల్లును. మీ వేదశాస్త్ర పరినాయాసము నిరర్థకము. దాన నిసుమంతయు మీకులాభంబులేదు. మీకును నాస్తికులకును భేదమించుకయు గనుపించదు. సన్యసించినను లేకున్నను భక్తిజ్ఞాన వైరాగ్యంబులు సత్కర్మానుష్ఠానము తత్త్వజ్ఞానము యాచార్య కృప మోక్షసాధనములు.

సీ॥ బ్రహ్మ సత్యంబని బలుకుచు జగమెల్ల మిథ్యయనుటచేత మీరుగూడ
బౌద్ధమార్గంబున బడుటయింతియెగాక, దానలాభము లేదుతలపమీకు
వేదశాస్త్రములు వేదాంతములుధర్మశాస్త్రములుసురలుసకలమునులు
గనుల యెండుపుగాగనుపించుజగమెల్ల మిథ్యయనుచుబల్కమీకుతగదు

కైంకర్య కరుడగు శేషాహి యీమహాను భావుడని దలచి తత్పాదార విందంబులం బడిన నా మహాత్ముండు దయా పూర్వకంబుగ నిజ కరంబుల నెత్తి నా సమాధానము వినకుండ నిట్లు చేతతగదు. నిన్న మీ రుపన్య సించినది భేదవాదమున కనుకూలముగాని యభేదమునకు సహాయకారి కానేరదని తగిన యుక్తుల బలుకబోవుచుండ యజ్ఞమూర్తి పునః ప్రణతుడై యిట్లనియె.

క॥ పాపిష్టుండను దుష్టుడ
గోపిని మూఢుండ ఖలుడ, కుత్సితమతి నే
నేపగిదిని భవజలనిధి
నేపుగ దాటంగగలను నేర్పడ జెపుమా॥ ౬౭

క॥ చేసిన పన్నియు దప్పాటె
దోసిలి యొగ్గెదను భీతి, దోషుడనగుటన్
భాసుర కరుణారసమున
దాసునిగా వంగవలయు తత్వనుబోధన్॥ ౬౮

క॥ చదివితినని గర్వించితి
చదువగ లేదనుచు నిపుడు చక్కగ దెలిసెన్
చదివింపుము నను నిప్పుడు
చదివెదనీ చరణపద్మ సన్నిధియందున్॥ ౬౯

క॥ గడచినదానిక వగవను
గడవంగా నున్నదాని గాపాడుకొనన్
నడవడియిక బోధింపుము
వడిదాటెద నీదుకరుణ పరభవ జలధిన్॥ ౭౦

(3)

క. మనుజుఁడవని నేఁదలఁచితి
ఘనమగు శేషాహివనుచు గట్టిగఁ దెలిసెన్
నను గావుము నినుఁగొలిచెద
మసిమెద నీపాదధూళి మలినతనుఁడనై॥ ౭౧

వ. అని యనేకవిధంబుల విన్నవించు నా యజ్ఞమూర్తిం గనుంగొని కరుణాంత రంగిత హృదయుండై యతి చక్రవర్తి యగు రామానుజాచార్యవర్యుండు తన సన్నిధినున్న సాత్త్విక శిష్యామణుల నవలోకించి, "యితండు సర్వవిదుండు. మన కంతరంగిక మిత్రుండు. అదియునుం గాక,

క. పదునెనిమిది దివసంబులు
విదితంబుగ వాదకేళి విబుధులు మెచ్చ
న్బదు నెఱిఁగి యుక్తిశతముల
సదమల గుణశాలి సలిపె జక్కని ఫణితిన్॥ ౭౨

వ. మరియు నితని పాండిత్యము సర్వతోముఖము-అద్వితీయము. నాకితఁ డంతరంగ మిత్రుఁడని దలఁచినాఁడననిబలికి యజ్ఞమూర్తి నవలోకించి మృదుఫణితి తత్త్వహితంబుల ఘటకాద్వయంబు సరసంబుగ, నుపదేశించి, విదిత తత్త్వ విశేషుండగు నాధీరునకు పంచ సంస్కారంబుల గటాక్షించి యరుళాళ ప్పెరుమాళెంబెరు మానారనెడి నామధేయంబు గృపఁజేసె. అపుడు యజ్ఞమూర్తితోఁడ నరుదెంచిన తన్మిత్రులును తత్పూర్వాశ్రమ పుత్రులును తత్పౌత్రులును, తద్బంధువులును రామానుజ యతిచక్రవర్తి శ్రీపాదంబుల నాశ్రయింప బ్రార్థించిరి.

రామానుజ యతిపుంగవుండును వారిం గనుంగొని వారలనందఱ నరుళాళ ప్పెరుమాళెం బెరుమానారుల శ్రీపాదంబుల నాశ్రయింపఁజేసి పరమంబులగు బహుహితంబుల నుపదేశించి యరుళాళ ప్పెరుమాళెం

బెరు మానారుల సకరుణంబుగ చతుస్సృష్టతి సింహాసనస్థులతో నొకనిగ నియమించి తత్ప్రసాదితంబులగు జ్ఞాన సార ప్రమేయ సారంబుల నవలో కించి యానందించి యా గ్రంథంబుల నాదర పూర్వకంబుగ గ్రహించె. అంత నాయరుళాళ ప్పెరుమాళెంబెరుమానారుల పూర్వాశ్రమ పుత్రుం డును బ్రక్రుతాశ్రము స్వపాదయుగళ సంశ్రిత శిష్యవర్యుండును నగు యచ్చానను వరదార్యునకు కృష్ణదేశికుండును, కృష్ణదేశికునకు గోవింద మునియు గోవిందమునికి లక్ష్మణయోగియు, లక్ష్మణయోగికి పెదతిరు మల శ్రీ వేంకటేశ్వర సర్వసామ్రాజ్య సర్వస్వ పరిపాలకుండగు శ్రీశైల రామానుజమునియు, నా సాధువర్యుని బదమూడవతరమున గల శ్రీనివాస దేశికునకు బెద్ద నరసింహాచార్యుండును, చిన నరసింహా చార్యుండును శ్రీరామాచార్యుండును ముగ్గు రాత్మజులు గలిగిరి. అందు పెద్ద నరసింహాచార్యుని వంశము నెల్లూరునను, శ్రీరామాచార్యుని వంశము ఖాసింకోట పురమునను విరాజిల్లుచుండెడివి. చిన నరసింహా చార్యుల వంశమున,

క. ఆ నరసింహా చార్యులు
భానుశశాంకాగ్ని నిభుల భవ్యుల ముగురన్
సూనుల వేడుకగనియెను
మానితగుణ రత్నహారమండి తగళులన్॥ 23

గీ॥ వెంకటార్యవరుడు తిరువేంగళార్య
గురుడు నరసింహనామక గురువరుండు
విమలత త్త్వార్థ విజ్ఞాన విదులుఘనులు
సరస పాండిత్యయుతులును సత్యయుతులు॥ 24

వ॥ అందు తిరువేంగళ దేశికునకు లక్ష్మణ బుధవరుండును లక్ష్మణ బుధవరునకు నరసింహా చార్యుండును శ్రీనివాస దేశికుఢును

శ్రీనివాస దేశికునకు లక్ష్మి నరసమాంబయు రాగమాంబయు శీత మాంబయు లక్ష్మమాంబయు వేంకట లక్ష్మణాచార్యులును నాంగ మాంబయు యను పుత్రీ పుత్రు లుదయించిరి. అందు స్త్రీసంతతి తామర తంపరవలె ప్రసిద్ధ స్త్రీపురుషులతోడ నభివృద్ధి నొందుచున్నది, మరియు నరసింహ నామక గురువరునకు దత్తపుత్రు నుశేషాచార్యులు శేషాచార్యు నకు దత్తపుత్రుడు రంగాచార్యులు. రంగాచార్యునకు వరదాచార్యులు వరదాచార్యున కనంతాచార్యులు వేంకట రామానుజాచార్యు లను యిరువు రుదయించిరి. అనంతాచార్యునకు వేంకట వరదాచార్యులు, వేంకట వరదాచార్యునకు తాండవ కృష్ణమాచార్యులు, అనంత రామా చార్యులు మరియు నలుగురు పుత్రికలు కలిగిరి వేంకటరామానుజా చార్యునకు వేంకట శేషాచార్యులు. వీరభివృద్ధి నొందుచున్నవారు. నరసింహాచార్యులవారి ప్రథమపుత్రుడు వేంక టాచార్యవర్యుడు.

మ॥ అఘ సంతారణ మార్గబోధన పరుం డామ్నాయ విద్యార్యుడై
లఘు బోధాధి గతాగమార్థనిచయా లంకార విస్ఫూర్తుడై
యఘహీనుండు సమస్త ధర్మతతిచే నారాధితార్యార్థుడై
రఘురామాంఘ్రియుగార్చనా నిరతుడై రాజిల్లె లోకంబునన్॥ 64

వ. ఆ మహాత్ముడు,

సీ. అష్టాక్షరీసిద్ధి నధిగమించినవాడు గురుపాద పద్మంబు గొలుచువాడు
వరవరాద్యుక్తుల వాసిగాంచినవాడు పరిచిత పరతత్త్వ భాగమువాడు,
పంచార్థములనెల్ల బరగ దెలిసినవాడు దివ్యదేశంబుల దిరుగువాడు
మంత్రరత్న మెపుడు మరచిపోవనివాడు సకల సత్కర్మలజరుపువాడు॥
గీ॥ నిత్యము క్తినిగోరుచు నిలుచువాడు
కనక మృదముల సమముగా గాంచువాడు

విషయ వాంఛలమానిన వింతవాడు
సుఖము దుఃఖంబు నొకరీతి జూచువాడు॥ ౭౬

సీ॥ అధికోర్వరాసిద్ధి నవలీల నార్జించి, యప్పరాయల కృపనధికుడగుచు
పుత్ర పౌత్రాదుల పూజలదానొంది, పూజ్యుల నెల్లను పూజదనిపి
శ్రీభాష్య తత్వార్థశరణతి శిష్యాళి, విజితాన్యమత వాది విజయుడగుచు
ద్రవిడ వేదాబ్ధినిదరచి దీసిన సుధ, విబుధుల కర్పించి వినుతిగాంచి

గీ॥ సకలవిద్యల దనతోడ, సాటిలేక
శమదమాదులతోగూడి, సత్వగుణుడు
చిరము జీవించి చిరకీర్తి, చేతదనరి
వేంక టార్యుండు వేదార్థ, వేదియొప్పె॥ ౭౭

గీ॥ ధీరుడాతడు గాంచెను ధీరవరుల
తిరుమలార్యుని వేంకట దేశికేంద్రు
నారసింహార్యు హరిపాద నళినభక్తు
వేద వేదాంతవిదులను వేడ్కతోడ॥ ౭౮

గీ॥ అందు తిరుమల దేశికు డార్యనతుడు
వేద వేదాంగ శాస్త్రార్థ వేదియధిగ
తార్థ పంచక విజ్ఞానుడ ఘవిదూరు
డఖిల సద్గుణ గేయుడై యలరె భువిని॥ ౭౯

వ. అతడు,

సీ॥ పురుషోత్తముడనంచు సిరిపీడి పదవేడి చెయిజాచి యాచించె సిగ్గులేక
ద్విజరాజు తానంచు ద్వేషించి దయలేక తమ్ములసిరిగూల్చె దాయయయ్యె
మిత్రుడ నేనంచు మితిలేక గర్వించి కువలయ విభవంబు గూల్చనయ్యె
దక్షుడ నేనంచు దైవము దూషింప దనయాగమంతయు దగ్ధమయ్యె॥

గీ॥ ననుచు వామనుచంద్రుని యగ్రదత్తు
బలిని సిరులచే భిక్షుల భక్తిసురల
దయను దమ్ముల సిరిగూర్చి దనియజేసి
పరులకైనను మిత్రుడై బరగెమిగుల॥ ౧౦

క॥ ఆతిరుమలార్య సూనుడు
శ్రీ తిరుమల గురువరుంపు శ్రీపతిభక్తిన్
పాతిత సర్వాఘౌఘుపు
ఖ్యాతిగ కాలంబు గడపె కలుములతోడన్॥ ౧౧

వ. ఆ మహాపురుషుడు,

సీ॥ పద్మాక్షు చింతనాపార వశ్యముచేత సకలంబు మరిచిన సత్త్వమూర్తి
సద్దర్శినీ జ్ఞానశక్తినియుక్తిచే నధరితాది తిసంద నాస్యవసుల
స్వీయోక్తిమారుతక్షి ప్రవేగోద్ధూత, పర వాగతూలున్నై రగువాడు
సకలభూతములకుసతతంబుహితవునుసలుపుచుండెడిసాధుసత్తముండు॥

గీ॥ వరభరద్వాజ గోత్రాబ్ధి వారిజారి
బంధుజన బృంద మందార భవ్యతరువు
శ్రీశపరతత్త్వ నిర్ణయ శీలుడాఢ్యు
డధిక కీర్తికి నిలయుండు హర్షయుతుడు॥ ౧౨

క. తిరుమల దేశిక వర్యుడు
తిరముగ బెండ్లాడెగరుణ తిరుమల దేవిన్
హారితస్థి గోత్రజాతను
కరివరదుని పాదభక్తి గలిగిన దానిన్ ౧౩

వ. అ దంపతులకు,

ఉ॥ శ్రీ జయదాన ధీయుతులు సేవిత రామపదారవిందులున్
రాజత సద్గుణాస్పదులు రాఘవ లక్ష్మణ దేశికోత్తముల్
ధీజిత దేవపూజితులు ధీరులు సర్వవిద గ్రగణ్యులున్
భూజన వంద్య సత్పదులు బుత్రులు బుట్టిరి వంశపావనుల్॥ ౧౪

వ. వారిలోపల జ్యేష్ఠుడు రాఘవదేశికుడు ద్వితీయుడు లక్ష్మణాచార్యులు. అందు లక్ష్మణాచార్యుడు దన ప్రథమ పత్నియగు యచ్చమాంబయందు సకల సద్గుణ నిధియగు నరసమాంబను, ముగ్గురు పుత్రులను గనియెను. వారిలో నరసమయను పరమసాధ్వీమణి స్త్రీ సంతతి యభివృద్ధి నొందు చున్నయది.

గీ॥ అరయ రాఘవ దేశికు డార్యనుతుడు
సకల సద్గుణ సంచయ సంయుతుండు
ధర్మపథవర్తి శిష్యేష్ట దాన రతుడు
మంత్రరత్నాను సంధాన మహితవృత్తి॥ ౧౫

సీ॥ ప్రతిపదావర్తిత పరమాత్మ చింతనా పరవశచిత్తుడు భక్తిరతుడు
పరభీషణంబుగ పరతత్వ నిర్ణయ దక్షుడు దశరథ తనయభక్తు
డతి కృపాన్విత శిష్యహర్షద, తత్వార్థ బోధనాసక్తుడు భూరివిదుడు
నిఖిలాగమజ్ఞుడు నిశ్చిత తత్వుడు సకల ధర్మవిదుడు సాత్వికుండు॥

గీ॥ విశ్వమందున గనుచున్నవి విధవస్తు
సంచయంబుల విడనాడ జాలునట్టి
గాఢ వైరాగ్య యుక్తుడు కర్మరుండు
బంధరహితుడు పాతిత విషయభరుడు॥ ౧౬

గీ॥ రాఘనార్యుడు నరసమ రమణియందు
గనియె చూడ మగమలాభ కాంచనాంగి
వేంకటాచార్యుని నరసింహ విబుధ వరుని
దనయ నొక్కతె నిద్దర తనయవరుల॥ ౧౭

గీ॥ అందు వేంకట దేశికు డమితశక్తి
కవిజనంబుల నెల్లను కవిత జిత
మోహినీ నాటకము వ్రాసి మోహమునను
సంతసింపగ జేసెను చతురుడగుచు॥ ౭౭

వ. అంత నా రాఘవాచార్యుడు,

క. ఘనవంశ వృద్ధి గోరుచు
ననుగుణయగు వేంకటాంబ నతిహర్షమునన్
మనమలర పెండ్లియాడెను
జనకాత్మజ గొన్న రామచంద్రునిబోలెన్॥ ౭౮

వ. ఆ వేంకటాంబ.

సీ॥ సతియని పేరొందె సచివుని నెమ్మను సగముజేసిన చాన సతియెయగు న
పతి దనవశుడని పతిరొమ్ము ననుబంధు సతికిజంచలగేయు సరసమగు న
పతివిలదని జెప్ప బలవంతమున నేగిబరగృహామునను నుంట బరవుయగు నె
స్థిరయని పేరంది బిరబిర నితరుల దరి జేరుచుండుట దగవుయగు న॥

గీ॥ యనుచు సతిని రమను సీతనచల దెగడి
వినయ భయ భక్తి సద్వృత్తి విభవశీల
సత్య శమదమ వైరాగ్య సహిత యగుచు
విపుల వర్తించె నాతల్లి వేంకటాంబ॥ ౮౦

గీ॥ అట్టివారికి సుతుడనై పుట్టినాడ
వేంకట తిరుమలాచార్య విశదనామ
ధేయుడను గురుపద భక్తి దెలిపినటుల
గడగినాడను వ్రాయగ గనుడు బుధులు॥ ౮౧

గీ॥ శాశ్వతానంద పదమున సంచరింప
భరత గుహవరు పదయుగ్మ భజనసేయ
దలచి పండిత కవివర దయనుగోరి
భరత చరితంబు బలికెద భవ్యులలర॥ ౮౨

వ. అని బుధవరకవి వరసమ్మతింగొని నా చిత్తంబున శ్రీరామ చంద్ర పాదారవిందయుగళ సన్నిధానంబు గల్పించుకొని

షష్ట్యంతములు.

క॥ శ్రీరామచంద్ర మూర్తికి
పారావారాభిసంధ్య పదయుగ్మునకున్
క్రూరాసుర సంహర్తకు
నారాయణ సైభవాఖ్య నరయాపునకున్॥ ౯౩

క॥ నవఘననిభ కాయునకున్
నవనచయాసూతవిబుధ సంఘస్తుతికిన్
పవన తనయార్చితునకున్
భవపాశవిమోచనాఖ్య పదయుగ్మునకున్॥ ౯౪

క॥ భానుకుల రాజపావిత్ర
మానవపరిపూర్ణ భాగ్య మంబాధునకున
భానుజవాంఛా ప్రదునకు
మానిజనాపన పరిణత మానితసుతికిన్॥ ౯౫

క॥ దశరథతనయా గ్రణికిన్
పశిహృదయనికేతనస్థ వరపాదునకున్
దశకంఠ కంఠలుంఠన
వశవర్తితకీర్తిపుష్ప వాసితభువికిన్॥ ౯౬

క॥ కిరధృతవర చాపునకున్
కరుణావితగాత్రమూర్తి కాంతామణికిన్
ఖరదూషణ సంహర్తకు
సరసీజపవిరాజమాన నలినాక్షునకున్॥ ౯౭

క॥ లోకైకారాధ్యునకున్
ప్రాకృతజనదూరభూత పాదద్వయికిన్
త్రైకాల్య నిత్యునకుపా
ణౌకృతనరరాడపత్యునకు రామునకున్॥ ౯౮

క॥ అభ్య స్తతత్వ సంచయ
సభ్యజనారాధనీయ సత్పాదునకున్
అభ్యర్థ నీయమూపున
కిభ్యజనాలభ్య భక్త బృందోన్నతికిన్॥ ౯౯

క॥ భక్తిని భరతచరిత్రము
శక్తికి తగినట్లువ్రాసి జానగురీతిన్
ముక్తికి మూలముగావున
రక్త నిడుదురామపాద రాజీవమునన్॥ ౧౦౦

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నేనొనర్పం బూనిన భరత చరిత్రంబను మహాప్రబంధమునకు కథాక్రమం బెట్టిదనిన తొల్లి పరమ కారుణికుడైన వాల్మీకి మహర్షి యొకానొక దినంబున దన యాశ్రమ మున నుండ దివ్యమునియగు నారదుండు జనుదెంచి సత్కృతుండై యుపవిష్టుండై యుండ వినయంబున వాల్మీకి నారదుం గనుంగొని మహాత్మా! దివ్యమునీంద్ర! నారద! నీవుసర్వజ్ఞుండవు మధ్యమలోకంబున నిప్పుడు సకల కళ్యాణగుణ సమన్వితుండగు పరమ పురుషుం డెవ్వండో దెలియ బలుకుమని ప్రశ్నించిన నారదుండు భూతభవిష్యద్వర్తమాన విదుండుగావున గరుణ వాల్మీకిం గనుంగొని పరమ పురుషుండగు నారాయణుండు; 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే' యనినట్లు సాధు పరిత్రాణమునకు దుష్టసంహారమునకు ధర్మ సంస్థాపనమునకు రఘు

వంశమున రామ నామధేయుండై యవతరించి తన తమ్ములగు భరత లక్ష్మణ శత్రుఘ్నులతోడను. రమాదేవ్యంశ జయగు దన ప్రాణ ప్రేయసి సీతతోడను గూడి దుష్ట సంహరణంబును శిష్ట పరిపాలనంబును ధర్మసంస్థాపనంబును జేసి పదకొండు వేల సంవత్సరంబులు మధ్యమ లోక మును బాలించి పిదప దన నిత్యనివాసంబగు శ్రీ వైకుంఠలోకమున కేగునని సంగ్రహంబుగ రామచరితం బుపదేశించి యథేచ్ఛం జనియె. అంత వాల్మీకి మహర్షి శిష్యుడగు భరద్వాజుండనువర్తింప కాల్య కృత్యంబుల దీర్చుటకుగాను తమసానదీ తీరంబునకు జని యట రూప సంపద మనో నయనంబుల కతి మోదంబు గల్పించుచు నవ్యక్త మధుర స్వనంబున కర్ణ పర్వం బొనర్చుచు మదనక్రీడల విహరించుచున్న క్రౌంచ పక్షి మిథునంబున పురుష పక్షిని క్రూరచిత్తుండగు నిషాదుండొకడు వాడిబాణంబున గూల్చిన యాడుపక్షి దీనస్వరంబున సకరుణంబుగ విల పించు చుండుట కటాక్షించి చింతా కోపంబులు తరంగితంబు లగుచుండ వ్యాధుని శపింప సంకల్పించునా మహర్షి నోట.

శ్లో॥ 'మానిషాద ప్రతిష్ఠాంత్వమగ మశ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేకమవధీః కామమోహితం॥

వ. శపింపబూనిన వాల్మీకి వదన గహ్వరంబునుండి తంత్రీలయ సమన్వితంబును సమపాద చతుష్టయ విరాజితంబును ద్వాత్రింశదక్షర బంధురంబు ననుష్టుప్ఛందవిహిత శ్లోకంబప్రయత్నంబున వెడలె. వాల్మీకియు భరద్వాజుండును విస్మిత హృదయులై కారణములేని కార్య మిట్లుదయించుటకు హేతువేమి యని యాలోచించుచు కారణంబు దెలియనేరక బహువారములా శ్లోకమును పఠించుచు కాల్యకృత్యంబుల నెరవేర్చి స్వాశ్రమంబునకు విచ్చేసియుపవిష్టులై దదేక ధ్యానంబున నుండ చతుర్దశభువన నిర్మాణ ధురీణుడగు చతురాననుడు సన్ని

హితుడైన ప్రాచేతసుండు భయభక్తుల ముప్పిరిగొని లేచి కమలాసనునకు సాష్టాంగనమస్కారముల సర్పించి పూజించి తగిన మానసంభావనమునిచ్చి సవినయంబుగ మహానుభావ నేను వ్యాధుని శపింపదలచిన నానోట శ్లోక మొకటి యావిర్భవించినది ' దీనికారణంబు విశదీకరింపుమని ప్రార్థించె. కమలాసనుండు కరుణా కటాక్ష తరంగిత హృదయుడై పుత్రరత్నమా మదీయచ్ఛందానుసారముగ వాణి నీ వదనంబునుండి నీశ్లోకమును వెడలించ జేసినది. ఇందు నారదుడు నీకుపదేశించిన రామకథయంతయు సంగ్రహముగ గలదు. ఇట్టి శ్లోకములచేతనె రామచరితమంతయు వర్ణింపుము. రామచరితమంతయు నీహృదయంబున సన్నిహితమగును. మదాజ్ఞానుసారము రామాయణ మహాకావ్యమును రచింపుమని యాజ్ఞాపించి యంతర్హితుండయ్యె. వాల్మీకి మహర్షియు సుప్రతిష్ఠిత[illegible] పాదుండై ప్రాగభిముఖముగ నుపవిష్టుడై యచల సమాధియోగమున రామచరితము నంతయు దెలిసి క్రమంబుగ చతుర్వింశతిసహస్రశ్లోకముల గాయత్రీమంత్రాక్షర సంఘటితముగ రామచరితమును సర్వమును సంపూర్ణముగ భూతభవిష్యద్వర్తమాన చరితముల వివరముగ బూర్తిజేసి యీ మహాప్రబంధమును సత్సభలనెవరు వినిపింతురని యాలోచించుచుండ సీతాపుత్రులును కుశలవులును కుశలవ నామధేయులు నిజ గురుపాదముల ప్రణమిల్లి సేవించి ప్రణమిల్లిన వారి నవలోకించి సంతసించి వారి కిరువురికిని రామాయణ మహాకావ్యమును సవిస్తరముగ సాంగోపాంగముగ నుపదేశించె. అంత నా యిరువురు కోసలదేశమునగల ప్రసిద్ధపురముల కేగి చక్కని రాగాలాపముల సత్సభల శ్రీరామాయణమును వినిపించుచుండిరి. అంత నొక దినంబున నయోధ్యాపురవరమున కేతెంచి రాజమందిరమున శ్రీరామచంద్రుని సమీపమున వాల్మీకిప్రోక్త శ్రీమద్రామాయణమును పఠించిరి. తద్వృత్తాంతా తగ్గ తేతి వృత్తసహితంబగు భరత చరిత్రమును తెనుగు భాష నేను వదించుచున్నాడ.

సీ॥ తొల్లియా వైవస్వతుడు మొదలుగఁగొని
యీవంశజులసొత్తు యీధరిత్రి
సాగరాభిఖ్యను సగరఖాని తమాట
వారిధిదాల్చెను వైభవముగ
సగరుడీ కులమున జన్మించి యరువది
వేల బుత్రులతోడ వెలసెనట్టి
యిక్ష్వాకునృపులలో నెల్ల సుగుణుడైన
రాముని చరితంబు రమ్యముగను

గీ॥ బుట్టె రామాయణాఖ్య పూజ్యవస్తు
విదియొకమలజు కరుణచే నిట్టిధర్మ
కామముఖ పురుషార్థ సంకలితమగుచు
గానవినుడసూయను పీడిఘనులుబుధులు॥ ౧౦౧

చ॥ సిరులకు నాటపట్టు సురసింధువుచేత సలంకృతంబు సం
సరణ మహార్ణవోత్తరణ సాదిత విష్ణుపదాబ్జ పోతమా
కరము సురత్న రాసుల కగారము విష్ణ్వవతార మూర్తికా
భరణము శేషభోగికిని భారత మీక్షితి భవ్యమంతటన్॥ ౧౦౨

వ అందు,

గీ॥ సమస్తృ సద్వంశ సంజాత సార్వభౌమ
పార్థివోత్తము పాలిత భాసురంబు
బహుళ ధనధాన్య సంయుక్త భద్రసుఖద
కోసలాభిఖ్య దేశంబు కొమరు మిగిలె॥ ౧౦౩

వ. ఆ దేశంబున,

సీ॥ వినతాగ్రమాభద్ర విజయవిలాసమై,
పొలుపొందు వైకుంఠపురముభాతి

వాణీవిలాసైక వైభవో పేతమై,
గననగు సత్యలోకంబు గతిని
గురుబుధ శతమఖ సురభి సుధర్మాది,
కలితమై నాకలోకంబుకరణి
భవ్య కళానిధి భరితమై విబుధాళి,
కలితమై విలసిల్లు గగనమట్లు
గీ॥ సర్వ మంగళా వాసమై, శంకరోచ్చ
సదనమును బోలె, ధననాథు సదనమట్లు
పుణ్య జన సంకులము ధన పూరితంబు
వీర భద్రాలయమువోలె వీరయుతము॥ ౧౦౪

సీ॥ సౌవర్ణ సౌధాళి సర్వాస్త్రయంత్రాళి,
రత్నాపణంబులు రమ్యవనులు
గోపురాట్టాల కగోగణ రథచయ,
సూత మాగధభట శూరవరులు
హృద్యమృదంగాది వాద్యమ్ములు విమాన,
సమమందిరంబులు సర్వసిరులు
ఘనగ భీర పరిఘకామినీ నాటక,
బహుశతఘ్నిశత పటలములును
గీ॥ నిరుపమాన సర్వ కళావి నీతబుధులు
వామదేవాత్రి కౌండిన్య వరమునీంద్ర
సములు విప్రులు రఘురాజ సములు నృపులు
గలిగియుండి రయోధ్యాఖ్య గలుగువురిని॥ ౧౦౫

క॥ ముక్తా ప్రసూన సంచయ
సక్తంబై పరిమళ యుత సరసాచ్ఛపయ

స్పృక్తంబై యలరెడిసువి
భక్త న్నృపపథములు గలిగి భాసిలుచుండెన్॥ ౧౦౬

వ. మరియు,

సీ॥ బాణంబు వేసిన భంగిసిరుజువు లౌ
రాజ మార్గంబులు రహింవహింప
గగనంబునోరయుచు గనుపించుసౌధము
లనులకందనిసౌరు గలిగియుండ
సకల భూములలోన సంచరింపగజాలు
బహువిధ రథములు పరిఢవిల్ల
ఇష్టకష్టంబుల స్పష్టంబుగ నెఱిగి,
ప్రజల బాలించెడి ప్రభులుగలుగ॥

గీ॥ సతతతురగ ఖురక్షుణ్ణ సంపతద్ర
జశ్శబలిత పార్శ్వస్థిత సాలతతులు
యంత్ర దీపప్రభాక్షిప్త యామినీత
మమలరు నయోధ్యనాపురమానితంబు॥ ౧౦౭

గీ॥ విరజచెంతను వైకుంఠపురమువోలె
సరయుచెంత నయోధ్యాఖ్యపురవరంబు
భద్రవిజయాభి నంద్య వైభవ్యరీతి
శ్రీసమంచితము బుధసంసేవితంబు॥ ౧౦౮

గీ॥ మానవేంద్రుఁడు గట్టించె మనువుమొదలు
చక్రవర్తులచేగాంచె సరసకీర్తి
యోధులకసాధ్య మగుట నయోధ్యయయ్యె
కోసలుల దేవభూజమై కొమరుమిగిలె॥ ౧౦౯

ఉ॥ సారసమిత్రుడా పురిని జక్కని పోరణగిండ్లవెంబడిన్
దూరితదీయ సౌధచయ దుర్భరవైభవ మోహితాత్ములై
వారితవేదనులై చిరము వర్తిలెగావున మంచిపాయిరై
కారితకర్ములై కుతపకాలమునందున దోచుచుండెబో॥ ౧౧౦

సీ॥ తల్లిదండ్రులమాట దాటరుతనయులు
తనయులనువులుబో తండ్రులకును
గురువులు విద్యల గూర్తురు శిష్యుల
శిష్యులు గురువులసేవ జేతు
రబలలు భర్తల సతిభక్తిగొలుతురు
భార్యలవీడరు భర్తలెపుడు
ప్రజల బ్రజలమాడ్కి ప్రభువులు గాతురు
ప్రజలురాజుల భక్తి బాయరెపుడు॥

గీ॥ దైవభక్తులుదాతలు ధర్మరతులు
కార్యకరులును శూరులు కర్మఠులును
జ్ఞాన విజ్ఞానయుక్తులు గానరతులు
దీర్ఘజీవులుగలరందు తీర్థనదులు॥ ౧౧౧

గీ. బాణరహితుని భీతునిబాలులోలు
వంశమునకెల్లనొకడైన వలువాని
శబ్దవేధ్యుని గొట్టనిశక్తియుతులు
గలిగియొప్పరయోధ్యాఖ్యగలుగుపురిని. ౧౧౨

గీ॥ పులులసింగంబుల వరాహపుంజములను
మదముచేతను గర్జిల్లు మహితశక్తుల
బాహుబలమున మర్దించు బహుసహస్ర
వీరవారంబుగల దండువింతగాను॥ ౧౧౩

క॥ కోసల జనపద వాసులు
వాసితమను ధర్మమార్గ వర్తనులగుట
న్మోసము లేని విధంబున
భాసిలుచున్నారు ఒరిమ భాగ్యముతోడన్॥ ౧౧౪

చ॥ ఆపురినుండువీరులు మహాభుజసారులు గాన కానలో
నేపునసంచరించెడి మదేభ మృగేంద్రుల వ్యాఘ్రకోటులన్
బాపురె బాహులంబొదవి పట్టివధింతురు ఖడ్గసంతతి
న్మాపులమూపులంగలిపి మొత్తుచునుందురు నాకయోధులన్॥ ౧౧౫

సీ॥ విశ్వవిదు లగ్ని కల్పులు వీరవరులు
బహుసహస్ర సంఖ్యాకులు భద్రబలులు
సర్వశస్త్రాస్త్ర వేదులు శాస్త్రవిదులు
సంధిముఖ షడ్గుణావళి సారవిదులు॥ ౧౧౬

గీ॥ ఆపురంబునగల యోధు లమితశక్తి
గోపురస్థుల యోధుల గొప్పసేయ
రనవరత లబ్ధ జయలక్ష్మి యనుగమింప
కంఠీరాంతస్థ సింహాళి కరణినుండ్రు॥ ౧౧౭

సీ॥ దేవతాతిథిపూజల ఒప్పరముగ
జేయుచుందురు దాతలు శిష్యహితులు
దీర్ఘజీవులు విప్రులు తీర్థకరులు
దవేదాంగ విద్యా వివేకయుతులు॥ ౧౧౮

సీ॥ బ్రహ్మముఖులైరి బాహుజుల్భద్రముగను
నూరుజులు బాహుజుల గొల్తు రుత్తమముగ
శూద్రులందరు నిజధర్మ శూరులౌచు
విప్రముఖులను గొల్తురు విశదముగను॥ ౧౧౯

ఉ॥ అందరు ధర్మమార్గరతు లందరు సత్యవచఃప్రసక్తు లం
దందరు సప్తతంతుకరణాతి నివిష్ట మనోభిలాషు లే
యందరు సర్వచేతన శుభావహయోగ్య సమస్త సత్క్రియా
నందితసర్వ సద్బుధులు నవ్యయశస్సిత సర్వదిక్తతుల్॥ ౧౨౦

గీ॥ అట్టి పురవరాధీశుఁడా యమలయశుడు
దశరథాహ్వయుఁడాఢ్యుఁడు ధర్మవిదుఁడు
ప్రజలలోపల చంద్రుని పగిదినొప్పె
విబుధహితదాయి కువలయ విభవదాయి॥ ౧౨౧

క॥ అమరాధిపు డమరావతి
విమలంబుగా నేలుపగిది విబుధులు మెచ్చన్
హిమశైలసేతు మధ్యను
సమదృష్టిని మనువుబోలె జక్కఁగ నేలెన్॥ ౧౨౨

సీ॥ దశదిక్కులందును దనరథమునుతోలి
దశరథనామంబు దాల్చినాఁడు
అరువదివేయేండ్లు బరువుగఁబవించి
పరిజలకు హితుఁడౌచు బ్రిబలినాఁడు
వాసవాసనమున వాసవుతోఁగూడి
సిర్ని ద్రవృత్తిని సిల్చినాఁడు
విబుధలోకమునెల్ల విహితయాగంబుల
దగినపూజలజేసి దనిపినాఁడు

గీ॥ మనువు చొక్కఁనదారిని మసలినాఁడు
గురుసి యనుమతి శిరమున గూర్చినాఁడు
దోర్బలంబున రిపులను దోలినాఁడు
నిఖిలదిక్కుల కీర్తిని నిలపినాఁడు॥ ౧౨౩

ఉ॥ చూచెడి వారికన్నులకు సోముని భంగిని దోచుచుండు గో
రోచన పీత విగ్రహుడు రూపజయంతుడు దూరదర్శి సం
కోచ విహీన పద్మనిభ కోమలనేత్రుడు సింహామధ్యుడా
సేచన కాత్మదర్శనుడు శ్రీకర చారుసు దీర్ఘబాహుడున్॥ ౧౨౪

సీ॥ అశ్రద్ధుడై యాత్మనతడు కాపాడున
నాతురుడై ధర్మనయము నొందు
నభిలాషలేకయె యర్థమార్జనసేయు
నక్తుడు గాకుండ సౌఖ్యమొందు
జ్ఞానియై మానంబు నరసతగాంచును
శక్తుడై క్షాంతిని సంశ్రయించు
శ్లాఘ్యదానముజేసి శ్లాఘా విముఖుడౌను
• సహజంబులితనికి సద్గుణములు॥

గీ॥ విషయముల విడనాడు వివేకమహిమ
విద్యలన్నియు నెఱుగును వివిధగతుల
ధర్మమున చిత్తమెప్పుడు దవిలియుండు
కవులబోషించు కళ్యాణ కలితుడగుచు॥ ౧౨౫

క. అధిగత విద్యానిచయుడు
నధిగతాహిత వీరలోక మానితచర్యుం
డధిగత విబుధవ్రాతుడు
ప్రథితాశ్రిత కామితార్థ ప్రదయాప్రముదున్॥ ౧౨౬

గీ॥ ప్రజలకెంతయొ వినయంబు ప్రబలజేసి
యన్నపానంబులిడి దయ నరసియతడు
తరినిగాపాడి తండ్రియై దనరియుంట
కన్నతండ్రులుజన్మకు కారణములు॥ ౧౨౭

గీ॥ అరయజానువు రోగుల కైనయట్లు
శత్రుడైనను శిష్టుడు సమ్మతుండు
దుష్టుడెప్పుడు త్యాజ్యుడే యిష్టుడైన
పాముగరచిన వ్రేలును బాపునట్లు॥ ౧౨౮

గీ॥ దీర్ఘదర్శియు తేజస్విధీరుడాఢ్యు
డతి రథోత్తము డుత్తమ భాగ్యయుతుడు
సత్యసక్తుడు ధర్మజ్ఞ సత్తముండు
వశిబలాఢ్యుడు రాజర్షి వారితారి॥ ౧౨౯

గీ॥ సకల జనవల్లభుడు మాని సమ్మతుండు
శక్రవైశ్రవణాధికైశ్వర్యయుతుడు
వాని యాకృతి కగ్గమౌ వానిప్రజ్ఞ
ప్రజ్ఞకగ్గాంబు శాస్త్రార్థ పాటవంబు॥ ౧౩౦

గీ॥ అతని పనులెల్ల ఫలముచే నరయవలయు
ప్రాక్తనములైన సంస్కార ప్రచయమట్లు
రాజులందరు మిత్రులై రహినిగొల్వ
ధరణి బాలించె దశరథ ధరణివిభుడు॥ ౧౩౧

క॥ అతనికి మంత్రులు ధీరులు
సతతముసద్ధర్మయుతులు సమయాభిజ్ఞుల్
మతిగురులు దీర్ఘజీవులు
హితచరులెనమండ్రుగలరు హిమవద్ధైర్యుల్॥ ౧౩౨

గీ॥ విజయసిద్ధార్థధృష్టులు వీర్యయుతులు
మంత్రపాలకాశోక సుమంత్రులనగ
నర్థసాధకుడు జయంతుడనగ మంత్రు
లమరియుండిరి గనురెప్ప లమరినట్లు॥ ౧౩౩

వ. అందు,

గీ॥ మంత్రులిద్దరు మాన్యులు మంత్రవిదులు
వామదేవు డరుంధతీ వల్లభుండు
సర్వసత్కార్య సాధక సత్వయుతులు
హితముగాంక్షించు సత్పురోహితులు గురుచు॥ ౧౩౪

గీ॥ అలసుయజ్ఞుడు గౌతము డార్యనుతుడు
కాశ్యపుండును జాబాలి కలుషహరులు
వరమృకండజు డాఘ్న్యుడు వరదుడలరు
మహితకాత్యాయ నాభిఖ్యమానితుండు॥ ౧౩౫

వ. వీరందరును,

గీ॥ యజ్ఞముల కార్యసంధాన యంత్రణముల
రాజ్యపాలన విధులను ర_క్తిగలసి
రాజహితమును కీ_ర్తిని రాజ్యవృద్ధి
గోరిమంత్రంబు జేతురు గోప్యముగను॥ ౧౩౬

వ. ఆదివంశ విశుద్ధుడును పరమధార్మికుడును నిక్ష్వాకుకుల జాతుడును మహావీరుడును సత్యవాదియు నాభాగపౌత్రుడును నజమహారాజ పుత్రుడును, నగు దశరథమహారాజు సార్వభౌమ సంపదన్వితుడై యరుంధతీ ప్రాణనాథుని సదుపదేశాను సారంబుగ మధ్యమలోకమును బాలించుచు నయోధ్యాపురమున నమరావతియం దమరాధినాథుని చందంబున సకల విబుధ పరివృతు డై విరాజిల్లుచుండె. అతనికి కౌసల్యయు సుమిత్రయు కైకెయియు యను ముగ్గిరు ప్రధాన పత్నులు గలరు. అందు మహిషియు జ్యేష్ఠపత్నియు కౌసల్యయను సతీరత్నము మరియు పంచాశ దధిక శతత్రయ పరిమిత పత్నీ గణంబుగలదు. మహావీరుండగు దశరథ మహారాజు చిరకాలము ధర్మ యుతముగ

రాజ్యపరిపాలనము జేసి సకలభోగ భాగ్యములను భూగోళ విజయము నిస్తంద్రిసమజ్ఞయు గలిగి వర్తించుచు దనకు సర్వభద్రంబులు గలిగియు సంతతిలేని లోపంబునకు మిగులవగచి చేయునదిలోచక నొక దినంబున మంత్రులనందర రప్పించి దనమనోవిచారమును విన్నవించె. వారందరును కొంతదడ వాలోచించి చక్కనియుపాయము నరసి దశరథు నవలోకించి "మహారాజ నీవింత విచారించ నక్కరలేదు. నీ వంశంబున నశ్వమేధ యాగం బొనర్చని మహారాజెవ్వరును లేరు నీవును హయమేధమొనర్చుటకు తగిన యోగ్యతగలవాడవు. సర్వ పరికరములు సిద్ధముగ యున్నవి. గాన యశ్వమేధ యాగ మొనర్చుము. దాని సంతతి వడయగలవు. దానిచే లభించని మనోరథమేమియు యుండదు. యితర విచారములుపీడి సత్వరంబుగ తత్సంకల్ప మొనర్చు" మని వచించిరి. దశరథ రాజేంద్రు డవ్వాక్యంబులకలరి వారలమన్నించి వారి కందరికిని నిజగృహంబుల కేగ ననుమతి నొసగి దా నంతఃపురంబున కేగి దనపత్నుల కీవృత్తాంతము నెరిగించె. అంత సుమంత్రుడు దనరాక నెరిగించి యొక రహస్యభవనంబున దశరథ మహారాజుతోడ విశ్రమించి వినయంబున కేలుమోడ్చి "మహారాజ పూర్వకాలంబున నొక యుగంబున దయాసాగరుండగు సనత్కుమారుండు మహాత్ములతోడ గూడి యొకచో విశ్రమించియుండ నే తత్సమయంబున జేరి [illegible] తదాజ్ఞను పవిష్టుడనై యుంటిని. అవ్వాడు నా సమయంబున మహా మహుడు మహర్షులకు వచించుచున్న నవలోకించి నీకొక విషయము ను వచించెదను కడుశ్రద్ధతోడ దానిని వినుము" మని యిట్లనియె. "విభాండక పుత్రుండగు ఋష్యశృంగునివలన నంగదేశంబునకు గలుగబోవు ననా వృష్టిని వారితంబగు పిదప నాఋష్యశృంగునివలన సూర్యవంశ సంభూ తుండగు దశరథునకు పుత్రకామేష్టిచే నపుత్రత్వదోషము పరిహృత

జగునని నాతోడ వచించె. అట్లనె యంగదేశంబునకు గలిగిన యనావృష్టి నివారితమైనదిగాన నీవు నీమిత్రుడగు రోమపాదునిగని ఋష్యశృంగుని గొనితెమ్ము. అతనికరుణ నశ్వమేధానంతరము బుత్రకామేష్టియొనర్చి పుత్రుల బడయగల” వని వచించెను. అదివిని దశరథుడు సుమంతునవలోకించి యంగదేశమున కనావృష్టి శాంతించిన క్రమమును వచించుమని బలికిన సుమంతు డిట్లని దశరథునకు వక్కాణించె. “మహారాజా యంగదేశమున నొకప్పుడు పన్నెండువత్సరంబులు వర్షంబులేక మహాపీడగలిగి ప్రజలెల్లరు పీడితులైరి. అప్పుడు రోమపాదుండు విద్వజ్జనుల నడిగినవారు వనమునుండి విభండకి సుతుఋష్యశృంగు రప్పించి యిట నిలిపిన యీయవగ్రహ దోషము శాంతించునని బలికిరి. యదివిని మంత్రుల నవలోకించిన వారు, రాజేంద్ర! యీ మునిపుత్రుడు లోకజ్ఞానములేక మృగమువలె నడవి చరించుచున్నవాడు గావున నాతని గొనితెచ్చుటకు వారవనితలు యోగ్యులు వారలు తమ చాతుర్య విశేషంబున వాని గొనితెచ్చెదరు.

క. జననాథ లోకమందున
ఘనమగు కార్యంబుసేయ ఘనసాధనముల్
వనితలెయని జనులాడెడి
యనపాయపు వాక్యమిచట నరయగవలయున్. ౧౩౭

క. వనరుహ గర్భుండైనను
వనజాక్షుండైన కృత్తివాసుండైనన్
వనితల మాయలబడుదురు
గనుకనె కార్యంబుసేయ గలరిటవారల్. ౧౩౮

క. అబలలని వారివలచకు
సబలలగుచు కార్యమెల్ల సాధింపంగా

పరిబలలుగను భావిఘండి
యబలయె యమృతంబు బంచి యనురులగాచె. ౧౩౯

గీ॥ ఇనుప కచ్చడాల్గట్టు మునీంద్రుడైన
నింతివశుడగు బెంచిస నిరిగినోలె
మదన శరములుచూపులు మగువలకును
వారువలపింప వలవనీ వారుగలరె॥ ౧౪౦

క॥ హృదయము నాకర్షింపగ
మదిరాక్షుల జూపుకంటె మరియొక టేలా
హృదయానందము నొసగగ
మదిరాక్షులకంటె గలవె మధురార్థంబుల్॥ ౧౪౧

గీ॥ అట్టివనితలలోనెల్ల నరసిచూడ
వారవనితలు చాతుర్య వారయుతలు
నారలకసాధ్యమగు నది వరలదేచట
వారిదీనిని సాధింప వలతులిపుడు॥ ౧౪౨

గీ॥ వారినిప్పుడె బిలిపించి వనమునకును
నానిదో తేర బంపుము వసుమతీశ
యనగ వినినృపుడప్పరో వనితలట్టి
వారవనితల రప్పించి వనికిబనిచె॥ ౧౪౩

క॥ ఎంతటి కార్యంబిదియని
పంతంబున సాహసించి పడతులు వేగన్
సంతస మొప్పగ జేరిరి
వింతవిలాసంబుగాంచి విశ్వముమెచ్చన్॥ ౧౪౪

వ. యిట్లు నడచి నడచి యొక వనంబుచేరి,

క॥ ఆవనము విభండకముని
రావున నొక కొంతమేర రివణోల్లుటచే
భావితముని భయవశమున
నావనమున నిలచిరి పలు యను వొప్పంగాన్॥ ౧౪౫

క॥ ఆవనమున నావనితలు
భావంబున కార్యసిద్ధి ఒడయుటకొర్కై
భావించిరి కందర్పుని
పావనపూజా విధానపద్ధతిచేతన్ ౧౪౬

వ. పూజానమాప్త్యనంతరము,

క॥ మునులవలె నక్షమాలిక
ననవరతము బూని నియతినద్భుతమొప్పన్
కనుమూసి జపము జేయుచు
వినుకలి కినుకలియులేక వింతగనుండెన్॥ ౧౪౭

చ॥ ఘనుడగు ఋష్యశృంగముని గాఢతపోనిధి యోగి భక్తిచే
వనమున నగ్నిపూజనము వాసిగ జేయుచు తండ్రిగొల్చుచున్
వినయము గల్గి వర్తిలుచు విద్యలనెల్లను నేర్చి పూరుషుల్
వనితలటన్న భేదమును నాసినెరుంగడదేమి చిత్రమో॥ ౧౪౮

ఉ॥ దైవనియుక్తిచేసి నియతాత్ముడు కారణమేగుదెంచియూ
పావనమూర్తి వేశ్యలను భావమునందున యోగులంచు సం
భావన జేసి డగ్గరిశుభంబగు మీకు నమస్కరించెదన్
తావకదర్శనంబునను ధన్యులుమామకవంశ్యులిత్తరిన్॥ ౧౪౯

వ. మహాత్ములారా నేను విభండకమునీంద్రుని పుత్రుండ ఋష్యశృంగుడనువాడ. ఇచటకు చేరువనుగల మా తపోవనంబునకు మీరలు విచ్చేసి మా వలన నతిథి సత్కారంబు వడసి చన ప్రార్థించు

చున్నాడ. మా జనకుడు విభండకుడు, కార్యాంతరవశంబున నెచటకో బోయియున్నవాడు. మూడు దినంబులు దాటిన గాని యాశ్రమ భూమికి రాజాలడు. నన్ను బాలుండని దలచక దయచేసి కృతార్థుని జేయవేడుచున్న వాడనని బలికిన నా వారవనితలు తమ కార్యానుకూలతకు సంతసించి యాతనిని యనేక విధంబుల సన్మానించి తమకు కార్యాంతరములు గలవనియు మరియొకప్పుడు విచ్చేయ గలమనియు ప్రస్తుతము రాజాలమనియు బలికి యతనిచే పునః పునః ప్రార్థితలై యాతని నుడిని యతిక్రమించలేనివారలవలె యభినయించుచు నెట్టకేలకు సమ్మతించి తదనుగమ్యమానలై నర్మవాక్యంబుల బలుకుచు శృంగార రసంబు వెల్లివిరియునటుల బ్రవర్తించుచు కంతువికారం బించుకేని నెరుంగని యాతని హృదయంబున నిదమిత్థంబని యాతడెరుంగని యానంద వికారంబుల నుదయింప జేయుచు ప్రగల్భవాక్యంబుల హావ భావ విలసనంబుల నారేచిత భ్రూచతుర రచనలుగల కటాక్ష విశేషంబుల నతనిహృదయం బావర్జించి వానితోడగూడి తదాశ్రమంబు జేరిరి. అచట నెచట విలోకించినను

సీ॥ గోవులు కొమ్ములగోకుచు నుండగా
పులులు కన్నరమూయు పొలుపుమీర
పులుల చన్గుడవంగబోవును మృగములు
సింగము ల్లేళ్లతో జేరిమెలగు
హరులు గోళ్ళనుగోక హర్షించు గజములు
పాముల లాలించు బభ్రుతతులు
యెనుములు గుర్రము లేకమై యుండును
పిల్లుల నెలుకలు ప్రేమగూడు

గీ॥ సహజ వైరంబు విడనాడె సత్వచయము
పుష్పఫలముల బూనెను భూజదితతి
కనులకెంతయొ హర్షంబు కలిగియుండె
వారవనితల ధైర్యంబు వదలిపోయె॥ ౧౫౦

వ. విభండకాశ్రమమును గణికలు బ్రవేశించి విభండకుడే తెంచిన తమకు ముప్పువాటిల్లునని భీతినొందుచు సత్వరంబుగ దమ కార్యంబు నెరవేర్చుకొన నెంచుచు దర్శన స్పర్శనంబుల నతనిని తమ నేర్పుకొలది నలరించి యతం డర్పించిన స్వాదుఫలంబులకును జలంబునకు నానందించి సత్కృతలై తమరుగొని తెచ్చిన మధుర భక్ష్యంబులతని కొసగిరి. యతండవి భక్షించి యవి ఫలంబులనియు వారుధరించిన చీని చీనాంబరములు వారియాశ్రమ వృక్షంబుల వల్కలంబులనియు, రత్న ఖచితాభరణంబులు పుష్ప విశేషంబులనియు, దలచి యట్టి విచిత్ర వస్తుజనకంబగువారి యాశ్రమం బవలోకించవలెనని మనంబున కోరిక గలవాడయ్యె. అంత గణికలువీణలధరించి హిందోళ వసంతాది రాగ విశేషంబుల శిలలనైన కరగించునటుల నాలపించి యాతని హృద యంబున నానందంబు పూరించి యావజ్జికోక్తుల చిత్రచేష్టల నతని నావర్జించి యథోక్త కారుని నొనర్చి మృదుమధుర వచనంబుల మా యాశ్రమంబున కొకసారి విచ్చేయుమని పలికిరి. ఆతండును వారి వాక్యంబుల నతిక్రమింపనేరక తానును గమ్యాగమనుఁడయ్యె అంత వారవనితలు జాగొనర్చిన కార్యంబు చెడునని సత్వరంబుగ నాతనితోడ బయలువెడలి విచిత్రకథల చెప్పుచు మధురగానంబుల నానందింప జేయుచు స్పర్శ నాలింగనాదుల నతిప్రమత్తునిగ నొనర్చి యెంత దవ్వు నడచినదియు నెరుంగకుండజేసి చాలదూరంబు నడిపించి తమ పురప్రాంతంబున నొక యుద్యాన వనమున నివసించి యంగేశ్వరునకు

తమరాక నెరింగించిరి. అంత యంగేశ్వరుండు సపరివారంబుగ నాతని చెంత కేతెంచి బహువిధంబుల సన్మానించి గృహంబునకు గొని తెచ్చి సుముహూర్తమున మనశాంతనిచ్చి పరిణయమొనర్చి రమ్యసౌధంబున నివసింపజేసె. అంగదేశంబున నా మహాత్ముడు పాదమిడుటతోడనె యనావృష్టి దోషంబు నివారితమయ్యె. పిమ్మట విభండకుడు దన యాశ్రమంబునకు విచ్చేసి యోగదృష్టిని విదిత వృత్తాంతుడై భవితవ్యమునకు బద్ధుడై శాంతించి యూరకుండె. కావున నీవు సత్వరంబుగ నంగదేశాధీశ్వరుగను గొని శాంతాసమేతుండైన ఋష్యశృంగు గొని తెమ్ము సఫలిత మనోరథుండవు గాగలవని సుమంతుడు దశరథ మహారాజునకు విన్నవించిన యా రాజేంద్రు డతని వచనంబుల కలరి యా రాత్రి బుచ్చిమరుదినంబున గురువరుండగు వశిష్ఠ మహామునికి దన సంకల్పమును వచించి యతనిచేత ననుజ్ఞాతుండై,

క॥ అనఘుడు దశరథు డప్పుడు
ఘనవాహన యుక్తుడగుచు కాంతలతోడన్
మనమున సంతసమందుచు
దనమంత్రులతోడగూడి తద్దయు నడచెన్ ౧౫౧

వ. అంత,

గీ॥ వనములను దాటి నదుల కావలికి సేగి
భూసురాగ్రహారములను పూజ సలిపి
రాజరాజుల సన్మాన రాజినంది
యంగదేశంబు చేరెను హర్షమునను॥ ౧౫౨

వ. సాకేత పురాధీశ్వరుండగు దశరథ రాజేంద్రుని రాక చారుల వలన విని రోమపాదుండు సకల సామంతపురోహితాన్వితుండై యెదు

ేగి సన్మానించి తన ఘరంబునకు గొని తెచ్చి యర్ఘ్యా సాధంబున విడియించి సవినయంబున నిట్లనియె॥

సీ॥ కరముల కమలాళి గలకలనవ్వించు
కమలబంధుని వంశ కలితుడెవడొ
సకల ధర్మంబుల సంపూర్ణముగ నిల్పి
సాకిన మనువంశ జనితుడెవడొ
యిక్ష్వాకు రఘుదిలీపేశుల వలె కీర్తి
బడయగల్గిన రాజభద్రుడెవడొ
దశదిక్కులను దేరు దగినరీతిని దోలి
దశరథ నామంబు దాల్చెనతడు

గీ॥ యతడు మా భాగ్యవశమున నరుగుదెంచె
శాంత జనకుడు శమితారి సర్వవిదుడు
తపసు ఫలియించె తాతలు ధన్యులైరి
కాంక్షితార్థంబులెల్లను గలిగె మాకు॥ ౧౫౩

వ. అని పలికి సకల విధ సత్కారంబుల జరిపి సంతసింప జేసి తన యల్లుండగు ఋష్యశృంగ మహామునీంద్రు నవలోకించి యితండు మనువంశ సంభవుండగు దశరథ రాజేంద్రుడు సాకేతపురాధినాథుడు, శాంతాజనకుడు, నా యందుగల కృపావిశేషంబున శాంతను నా కిత డిచ్చిన వాడు. నేను పెంచి పెద్దదానిని జేసి నీకొసంగితిని. ఇతడు రాజ్య విస్తారమునను వయసునను గూడ మిగుల వృద్ధుడు. పురుహూతవైభవుడు, వశిష్టశిష్యుడు, మనకును నితనికిని తరతరంబుల నుండి సఖ్యసంబంధములు గలవు. పూజ్యపాదుడగు నితడేమి గోరి వచ్చెనో దానిని నెరవేర్చి మనము కృతార్థులము గావలెనని వక్కాణించె. అంత కొన్ని దినంబులు,

క॥ ఇష్టకథా లాపంబుల
శిష్టులతోఁ గూడి యతఁడు శిష్యులమోలెన్
మృష్టాన్నాదుల నొసగుచు
నిష్టములం దీర్చు చుండె నింపుదలిర్పన్॥ ౧౫౪

వ. అంత నొకదినంబున దశరథుఁడు రోమపాదు నవలోకించి,

క॥ ఆలోక బాధవాదిగ
వాలాయముగాఁగ నేను నాసిగ తుదిన్నై
ప్రాలిన వంశమునిలుపగ
వ్రేలెదు సుతుగాంచనేను వేల్పెద క్రతువున్॥ ౧౫౫

క॥ సంతానము లేకుండిన
చింతకు పాల్మాలినేను శీఘ్రము యిటకున్
శాంతాభర్తను వేడగ
కాంతలతో వచ్చినాడ కార్యార్థుడనై॥ ౧౫౬

గీ॥ ఆవశిష్టుని యాజ్ఞనే ననుసరించి
యాదరాసక్తి వచ్చితి నార్యమిత్ర
కార్యభారంబు మిక్కిలి గలుగునాకు
వేగ నల్లుని [illegible] వేడ్క [illegible]॥ ౧౫౭

క॥ యోలితిని కువలయంబును
సోలితి సంప్రాప్తవిజయ శోభాయుక్తిన్
వాలితి సౌఖ్యాంభోనిధి
మేలుగ బుత్రార్థినగుచు మిము గనుగొంటిన్॥ ౧౫౮

క॥ అమరులు జంపగజాలని
యమరారుల జంపగరుణ నమరేశ్వరుడే
తమిదన యాసనమందున
సమముగ నను నిలపెగాదె సంతోషమునన్॥ ౧౫౯

వ. అనిబలికి యూరకుండిన యతని సాధువాక్య రచన కానం దించి రోమపాదుండు రఘువంశ పావనుండగు దశరథుని తలంపు దన యల్లునకు వినిపించి యంగీకరింపజేసి దశరథు నవలోకించినీ పుత్రికయు నీ యల్లుండును భవదాజ్ఞానుసారము సాకేతపురంబునకు విచ్చేయుచున్న వారు వారింగొని చని నీ యభీష్టంబు నెరవేర్చుకొనుము. నీవుతలంచిన కార్యంబు నిర్విఘ్నంబుగ నెరవేరగలదని వినయంబున బలికెను. దశరథ రాజచంద్రుడు సత్వరంబుగ రోమపాదుని యనుమతిని బయలువెడలి శీఘ్రగమనంబున సాకేత పురాభిముఖుడై నడుచుచుండె. అంత నయోధ్యాపురంబున శాంతాసమేత ఋష్యశృంగుని గొని దశరథ ధరణీ పాలు డేతెంచుచుండుటను,

ఉ॥ దూతలుజెప్ప బౌరులు మృదూక్తుల నొక్కరికొక్క రింపుగా
నాతతమైన పట్టణము నందముగాగ నలంకరింప గా
బ్రీతిని జెప్పుకొంచు దమ ప్రీతికి పాత్రను శాంతనల్లునిన్
చేతము చల్లగాగనగ చిత్తమునందున గోరిరందరు॥ ౧౬౦

వ. అంతిపురం బత్యంత శృంగారంబుగ నలంకరింబడియె. దశరథ నృపాలుడు ప్రమోదాతిశయంబున పురప్రవేశం బొనర్చి రాజమార్గంబున నడుచుచుండె. తత్పురబహిర్ద్వారద్రికాని కాయంబులుతద్గృహాంకణంబులు, విరచిత కస్తూరీ కర్దమగోముఖ పరిష్కృత విచిత్ర తరంగిత రంగనల్లీ మచ ర్చికామనోజ్ఞాతి స్థూలముక్తా ఫలమండలీ పాండిత్య రచనావిశేష కాంతం బులు. కలవడంబులు కమనీయ కాంచన దండంబుల బెడంగుల దొంగలి గొను హేమ కల్హారాలంకృతంబులై గగవతల విభ్రాజమానంబులు సప్తభౌమాష్ట భౌమ రమ్య సౌధంబు లుత్తుంగశిఖర సంస్థాపిత వాతపోత సంచాలిత రమణీయకే తుసంతానంబులుఃనిశాసమయ పరస్పరసంఘర్షణ విశకలిత పరితఃపతిత సరయూనదీ స్థూలాణు జలకణంబులు సంధుక్షణ

సంలక్ష్యమాణవిష్ణు పదతారకా సముదయోత్ప్రేక్షావహంబులు రాజమార్గంబులు పార్శ్వద్వయమున ఖాత పత్రఫలశలాటుకాపల్లవ లక్షిత కదళీవృక్ష సమంచిత క్రముకస్తంభ బంధుర చ్ఛాయమానలతికలు, జల యంత్ర వికీర్యమాణ శీతల జలకణ జాలసంసిక్తానవరత యాతాయాత తురగ ఖురక్షుణ్ణ పరాగంబులు, ప్రతిద్వారంబులు నవరత్న స్యూత చిత్ర తోరణ విరాజితంబులు, నైనేత్ర పర్వంబుగ నలరారు నయోధ్యా పురమతల్లిని గనుచు పౌరులకు దనయందుగల భక్తికి యానందించుచు రాజభవనంబు జేరి యంతఃపుర ప్రవేశం బొనర్చె. పురజనులును రాజ పత్నులును శాంతను తత్ప్రియునిగాంచి, యమందానంద కందళిత హృదయారవిందులైరి. పెద్దలందరును ఋశ్యశృంగుని ప్రయత్నంబు సఫలం బగునని దమ మనంబుల నిశ్చయించిరి.

వ. అంత,

క॥ చూతములు పూచి కాచెను
వాతంబులు వీచె పుష్ప వాసనయుక్తన్
భీతిని బొందిరి పాంథులు
జేతము సంతసమొంద చెలగి వనాళుల్॥ ౧౬-౧

గీ॥ చిగురుటాకుల మెక్కుచు చిత్రముగను
కోకిలంబులు గూసెను "కో" యటంచు
బంభరంబులు పూదేనె భవ్యగతిని
యారగించుచు నానందమందుచుండె॥ ౧౬-౨

వ. అట్లు వసంతర్తువు సమీపించుటతోడనె దశరథ మహారాజు ఋష్యశృంగు నవలోకించి యిక జాగుచేయక నశ్వమేధ యాగం బాచరింప సంకల్పము చేయించవలెనని కోరెను.

చ॥ పరగ మునీంద్రుడా పలుకు భావమునందున నిల్పి సత్కృపన్
వరతురగంబు వేవిడువు వస్తువులెల్లను సంగ్రహింపు మీ
యరమర లేదు పుత్రులిక నద్భుత వీర్యులు బుట్టివంశము
న్బరగున వృద్ధిజేయుదురు సత్యము బూనెద యాజకత్వమున్॥ ౧౬౩

చ॥ అనవిని సంతసించి నృపు డాదరమొప్ప సుమంత్రు జూచి యా
ఘనుని యరుంధతీ విభుని గర్వ విదూరుల ఋత్విగాదులన్
వినయముతోడ నీవె చని విన్నపమొప్పగ జేసి వేగమే
మనమున సంతసం బొదవ మాన్యుల దెమ్మిటకంచు బల్కెనన్॥

వ. అతడు సత్వరంబుగ జని,

గీ॥ వామదేవుని కాశ్యపు వరసుహాఘ్న్యు
నలవశిష్టుని జాబాలి నఖిల విదుని
భూమి సురులను సుయజ్ఞ భూపుకడకు
దెచ్చె నాతడు సద్భక్తి దేటపడగ॥ ౧౬౫

వ. అట్లు జనుదెంచిన దశరథుడు,

చ॥ అతి దృఢభక్తి నామునుల సర్చలొనర్చి మహానుభావులా
మతికుశలుండు రాఘవుడు మాన్యుల కిట్లని బల్కెనింపుగా
సతతము మిమ్ము గొల్చినను సంతతిగల్గ దిదేమి చిత్రమో
సుతులనుగూర్చు సత్క్రతువు సుష్ఠుగ జేయ ననుగ్రహింపుడీ॥

క॥ సంతానము గలుగమికిని
సంతాపము నొందు నన్ను సంరక్షింపన్
సంతాన మిచ్చు క్రతువును
శాంతావిభుతోడ మీరు జరుపగవలయున్॥ ౧౬౭

క॥ హయమేధము జేయింపుడు
దయ దనయులు గలుగు దాన దప్పదు సుండీ
నయ విదులు మీరు గావున
భయమును దొలగించి గావ భక్తిని గొలుతున్॥ ౧౬౮

చ॥ అనవిని విప్రులందరపు డంచిత లీలనరుంధతీ విభుం
గనుగొన, ఋష్యశృంగముని గాంచి వశిష్ఠుఁడు సంప్రతించియో
మనుకులవార్ధిసోమ వినుమాన్య విభండకసూను సత్కృపన్
తనయులు నీకుగల్గుదురు, తథ్యము పీడుము వేగ మేయయున్॥ ౧౬౯

క॥ సంతతి కలుగగ వలెనని
సంతత సద్భావకలన సాధుల గొలువన్
సంతతి గలుగకయుండునె
సంతోషము నొందవయ్య సంతతి గలుగున్॥ ౧౭౦

క॥ నలుగురు తనయుల బొందుదు
పలుబలుకులు బలుకనేల భాస్కరవంశ్యా
కలుషములు దొలగిపోయెను
కలుగును భద్రంబులెల్ల గాంక్షలుదీరన్॥ ౧౭౧

క॥ అని పలికిన మునిపలుకులు
విని హర్షమునొందె విభుడు వేడుకతోడన్
దనయులు గలిగినవిధమున
దనమనమున దలచిపొంగె ధన్యుడననుచున్॥ ౧౭౨

క॥ చిత్రాపూర్ణిమ యందున
సత్రార్థముజేసి రాజు సాంగ్రహణేష్టిన్
పుత్రావాప్తికి విడిచెను
సత్రాణము యయువుసర్వ సాధనయుక్తిన్॥ ౧౭౩

గీ॥ సకల వస్తువులెల్లను సంగ్రహింప
దగినవారల నియమించె ధరణివిభుడు
కార్యకరులైరి మంత్రులు కార్యవిదులు
విప్రులాతని దీవించి వేగజనిరి॥ ౧౭౪

వ. అశ్వమేధ యాగార్హంబగు తురంగమము మహాసేనా సమన్వితులగు పెక్కండ్రు భువనవిఖ్యాతులగు మహారధికులచే రక్షితంబగుచు స్వేచ్ఛావిహారంబు సల్పుచుండె. విశ్వంభరయందుగలరాజవరులందరు దమ హృదయంబు లసూయా కలుషితంబులై యున్నను దశరధుని దాడికి నిలువజాలమను భీతిని యశ్వరాజంబు చెంతకొకరైన యేతెంచినవారుగారు సర్వంసహ నంతయు స్వేచ్ఛగ తిరిగి తిరిగి. యయోధ్యానగరమున కేతెంచుచుండ పునర్వసంతము సమీపించుచుండె నంత,

చ॥ ఆనఘుడు రాజశేఖరుడు హర్ష వివర్ధిత కార్యవేగుడై
వినయముతో వశిష్ఠముని వేడ్కగనుంగొని భక్తియుక్తుడై
ఘనుడవు నీవు సద్గురుణగావగ యజ్ఞధురంబు బూనుమీ
ఘనమగు వాంఛితంబులను గాంచగ చిత్తమున స్థలంపుమీ॥ ౧౭౫

క॥ తాతల తాతల నుండియు
నేతగులము లేక మమ్ము నేలితివయ్యా
యీతరమున నను గావని
హేతువు వచియింపవయ్య హిమవద్ధైర్యా॥ ౧౭౬

క॥ హితుడవు గురుడవు పూజ్యుడ
వతి నిపుణుడ వన్ని పనుల నద్భుత తేజో
యుతుడవు బుత్రానాప్తికి
క్రతుభారము బూని నన్ను గావుము గరుణన్॥ ౧౭౭

వ. అని పలుకు దశరథుని వాక్యము లవిని నవ్వుచు వశిష్ఠుడు "రాజేంద్రా, నీవేమియు సంశయింపకుము. నేనిక నీవు చేయబూనిన యశ్వమేధ యాగ భారమునంతయు బూనెదను. నీకేకోదువయు గలుగ నియ్యను. నీవు నిశ్చింతుడవై యుండు" మని బలికి శిల్పులను చిత్రకారులను వర్ధకులను గణకులను స్థపతులను ఖనకులను గాంచి వారి వారికి తగిన పనులు బోధించి సత్వరంబున సరయూత్తర కూలమున యజ్ఞశాలలను పాక గృహంబులు వలయునన్ని నిర్మింపుడు. స్త్రీలు, పురుషులు, బాలురు, విప్రులు, రాజవరులు తదితరులును నివసించదగిన గృహంబు లనేకంబులు దృఢంబులు వాసయోగ్యము లగునట్లు గట్టుడని యాజ్ఞాపించి తదనుకూల సంవిధానంబు లన్నియు వారికి బోధించి వలయు వస్తువులన్నియు తదగ్రగృహంబులను నునుప సకల కృత్యంబుల నెరవేర్చను తగినవారిని నియమించి యధికృతుల నవలోకించి,

గీ॥ విప్రవరు లెందరెందరో వీటిపట్ల
నుండువారలు రాగల రాహ్వితముగ
వారు కోరిన వస్తుల వరసతోడ
నిచ్చి తృప్తిని బొందింపు డింపుతోడ॥ ౧౭౮

వ. ఏ వర్ణమువారు విచ్చేసినను వారి వర్ణమునకు తగిన నివాసములు సత్కారములు జరుపవలయును. శాస్త్రవిధుల నావంతయు నతిక్రమించ జనదు. ఎవరికిని లేశమాత్రమైన నవమానించతగదు.

గీ॥ లేని కార్యంబు దీర్పంగ రేయి బగలు
కష్టమెట్టులైన భరియించ గడగవలయు
సవితృవంశంబు సంతాన సక్తముగుచు
జగము బాలింప జేయగాజాలవలయు॥ ౧౭౯

వ. అని బలికిన వశిష్ఠమహర్షి వాక్యంబుల విని వారు వినయ భయభక్తి శ్రద్ధలు గలవారలై తమకు నియమితములైన పనులన్నియు నిర్వహించిరి యరుంధతీ ప్రాణనాథుడు సుమంత్రు నవలోకించి నీవు సత్వరంబుగ భూలోకంబున గల విశిష్ట బ్రాహ్మణులను రాజవరులను పూజ్యులగు నందరను యజ్ఞ సందర్శనార్థము బిలిపించుము మరియు,

క॥ మిథిలా నాథుడు శూరుడు
విధియుక్తముగాగ వేదవేదాంగములం
బుధులెల్ల మెచ్చ నెరుగను
విధిగానీ వేగియతని వేడెమ్మటకన్॥ ౧౮౦

గీ॥ పూర్వసంబంధి యతడొట పూజ్యతముడు
యాజ్ఞవల్క్యుని శిష్యుడు యజ్ఞవిదుడు
సర్వశాస్త్రార్థవిజ్ఞుడు సర్వసముడు
సత్యవిక్రమ యుక్తుడు సత్యయుతుడు॥ ౧౮౧

వ. మరియు,

గీ॥ రాజసింహుని మిత్రుడు రాజవరుడు
హితము దెలియుచు కాశీశుడిద్ధ కీర్తి
యతని గొనితెమ్ము నీవేగి యాదరముగ
నతడు విజ్ఞుడు పరమార్థ మరయువాడు॥ ౧౮౨

చ॥ మనుకుల రాజశేఖరుని మామను కేకయపార్థివేశ్వరు
న్ఘనముగ జంతు భాషలను కమ్రపురీతి నెరుంగువానిని
న్ఘనుని సపుత్రుదెచ్చుటకు గట్టిగనీవట కేగు వేగమే
యనఘుడు వృద్ధుడార్యనుతు డాఢ్యుడు బంధువరుండు గావునన్॥

గీ॥ వినయవంతుని విశ్వాసి వేదవిదుని
సకల శాస్త్రార్థవిజ్ఞాను సత్యవాక్యు
బాహుబలమున విఖ్యాతి బడయువాని
రోమపాదుని బిలువుము యాదిగాను॥ ౧౦౪

క॥ కోసలదేశము నేలెటి
భూసుర పరిపాలనైక భూషితచిత్తున్
వాసిగ గొని తెమ్మిచటికి
భాసురుడగు భానుమంతు భాస్వద్వంశ్యున్॥ ౧౦౫

గీ॥ మగధనాధుని బిలువుము మాన్యుడతడు
దాతలందున ముఖ్యుడు ధన్యశేముషు
క్రతువులెన్నియొ చేసెను క్రమముగాను
సత్కృతుల జేయదగువాడు సత్వమూర్తి॥ ౧౦౬

సీ॥ సౌరాష్ట్రనాధుల సౌభాగ్యయుక్తుల
తూర్పును బాలించు దొరలనెల్ల
సౌవీరవిభులను సౌజన్యయుక్తుల
ధనధాన్యసంయుక్తి దనరువారి
దక్షిణంబేలెడి దాక్షిణ్యయుక్తుల
సింధుదేశము నేలు శీలయుతుల
నంతల పొంతల నందర బంధుల
పరివారయుక్తుల పరిచితులను

గీ॥ వీరు వారననేల నీవిశ్వమందు
బిలువదగునారి నందర బిలువబంపు
మఘము జూతురు మఘువుని మఘమునట్లు
సత్కరింతము వారల సర్వగతుల॥ ౧౦౭

క॥ ఎక్కువ తక్కువ లెంచక
మక్కువతో నెందరైన మన్ననతోడన్
చక్కెర ఫలముల మెసవుచు
నొక్క కుటుంబజుల బోల నుంచుము శక్తిన్॥ ౧౮౮

చ॥ అన విని మంత్రి తద్విధిని నంతయు గూర్చి గుణోక్తి చొప్పునన్
వినయముతోడ విన్నపము విజ్ఞుడు చేయగ నాలకించి యా
మునియును యజ్ఞవాటికకు మోదముతోడుత బోయిచూచి యా
పనులును వస్తు సంతతులు భవ్యము లౌటను గాంచె మోదమున్॥

క॥ కర్మాంతి కుల గనుగొని
కర్మంబుల నెల్ల బూర్తిగావించుటచే
శర్మంబుల నొందుదు రక
భర్మంబుల బొందగలరు బహుభంగులుగన్॥ ౧౯౦

వ. అని పలికి సుమంతు నవలోకించి

చ॥ అరమర లేదు దివ్యమును లద్భుత తేజులు రాజపుంగవుల్
కరమను రక్తి భూసురులు కాశ్యపినుండెడి సర్వమానవుల్
వరగుణులెందరో యిటకు వచ్చుచు నుండిరి గాన వారలన్
సరసముగాగ సత్కృతుల సర్వవిధంబుల జేయు మింపుగన్॥ ౧౯౧

క॥ అవమాన మించుకేనియు
నవరులలోనైన గాని యమరక యుండన్
సవరణగాగ సపర్యల
వివరముగా జేయవలయు వినయము తోడన్॥ ౧౯౨

క॥ అవమతి యేరికి గలిగిన
నవమానము మనకు గలుగు నపవాదముచే
నవనీశుడొందు కీడు ల
నవహేళన మంది క్రతువు హర్షము దొలచున్॥ ౧౯౩

క॥ అని బలుకుచుండ నంతట
ఘనులగు ధాత్రీశు లెల్ల గడు వేగముగా
గనగొనువారల కెల్లను
మన మలర నయోధ్య జేర మంత్రియు వేగన్॥ ౧౯౪

గీ॥ తగిన విడులు జూపించి ధరణీధవుల
క్రమముగాగని సన్మాన గరిమజరిపి
వారలర్పించు కానుకల్వారస గొనుచు
నందరిని దాను సంతోషమంద జేసె॥ ౧౯౫

క॥ రేయింబవళులు రాజులు
హాయిగ జనుదెంచుచుండ హర్షముతోడన్
పాయక బూజలదనుపుచు
నాయ తనములందునిల్పి యలరగ జేసెన్ ౧౯౬

వ. అంత మానవరాజులు మునిరాజులు ద్విజరాజులు సకల మానవులు తమతమ విడుదుల సుఖముగ నివసించియుండ సర్వజ్ఞుడగు వశిష్ఠమహర్షి రఘువంశశేఖరుండగు దశరథు నవలోకించి,

చ॥ సకల రసాధినాథులు భవన్మహితాజ్ఞ శిరంబులందునన్
వికసితపుష్పమాలికల వేడ్కధరించిన రీతి దాల్చుచున్
సకలసువర్ణసంతతుల జక్కని తేరుల వారణాళులన్
ప్రకట సువర్ణజాలయుత ధర్మఘటంబుల వస్త్రభూషలన్॥ ౧౯౭

గీ॥ గొనుచు భూలోక దేవేంద్రు గొలువనిన్ను
భక్తి నేతెంచియున్నారు భవ్యులెల్ల
వారినందరి బూజించి వసతులెల్ల
నేర్పరించితి మెచ్చిరి యేకరీతి॥ ౧౯౮

క॥ యజ్ఞీయములను గూర్చిరి
యజ్ఞాయతనంబులందు యజ్వలుబాగడఁ
యజ్ఞము సంకల్పించుచు
యజ్ఞాయతనంబు నీకు యాతవ్యమికన్॥ ౧౯౯

గీ॥ అనువశిష్టుముని విభండ కాత్మజాతు
వాక్య సుధగ్రోలి యానంద వార్ధిమునిగి
స్వస్తివాదన ముఖరుల సర్వవిదుల
విప్రముఖ్యులతోఁగూడి వేడ్కఁ వెడలి॥ ౨౦౦

క॥ శుభదివసతార లందున
శుభవాద్యము లెల్ల మ్రోగ శోభాన్వితుడై
శుభవస్తు వితతి దోడ్కొని
విభవాధికుడైన రాజు వెటలెను వేగన్॥ ౨౦౧

చ॥ అటుజని గాంచె భూమివిభు డంబరచుంబి గృహోత్తమంబులన్
పటుతర సర్వవస్తువులొ భావుకమానస కల్పితంబులో
దిటముగ యోగజాతములొ దివ్యములో యన నొప్పువాటినిన్
పటుతరయోగ నిష్ఠులను భవ్యుల విప్రుల బ్రహ్మవేత్తలన్॥ ౨౦౨

చ॥ సవనముదీర్ప సద్విధిని సద్విజముఖ్యులు ఋశ్యశృంగునిన్
శివము వశిష్ట సంయమిని శీఘ్రము ముంగర నిల్పి ధీరులై
యవసరమైన వస్తుతతులన్నియు జేర్చి సుఖోపవిష్టులై
యవిరళ మంత్రజాలముల నవ్యయులౌ నొనర్చి రందరున్ ౨౦౩

వ. అప్పుడు,

సీ॥ సకల దేశంబుల సంచార మొనరించు
హయమును బట్టెడి యతడె లేడు

స్వేచ్ఛగ దిరుగుచు స్వేచ్ఛగ దినుచును
క్రమముగ నా కేతగామియయ్యె
తిరుగవసంతంబు తీరుగ నేతెంచ
రక్షకులెల్లరు రమ్యముగను
హయమతో జేరిరి హాయిగాగను నేగి
రథకారగృహమున రాటగట్టి
గీ॥ రశ్వవరమును బ్రహ్మాదులమిత నియతి
దానిపదముల నాల్గింట ధర్మమెరిగి
హోమమునుజేసె రారాత్రి హోత్రలెల్ల
శాస్త్రములనెల్ల నెరిగిన శాంతమతులు॥ ౨౦౪

వ. పిమ్మట బ్రహ్మయగు ఋష్యశృంగుడు మొదలగు నలుగురు ఋత్విక్కులు హయమేధాశ్వమును యాగశాల యందశ్వస్థబ్రజమున బంధించిరి. వేదపారగులు వేదమును మీమాంసను కల్పసూత్రముల ననుసరించి యథాయోగ్యములగు వైశ్వదేవాదికము నాచరించిరి. పిదప ప్రవర్గ్య బ్రాహ్మణోక్త ప్రవర్గ్యమును, నిష్టి విశేషములు, నుపసద మును సాంప్రదాయ సిద్ధములగు సథికకర్మలను జేసిరి. ప్రాతస్సవన మాధ్యందిన సవన తృతీయసవనముల నాచరించిరి. ఐంద్రమింద్రునికొరకు నివ్వబడినది. సోమరాజు స్తోత్రశస్త్రములచే స్తుతిచేయబడెను. సర్వ హోమాదికములు, మంత్రయుక్తములు, క్షేమయుక్తములు, నిర్విఘ్న ములై ఒప్పినవి.

చ॥ స్ఖలితములేక హోమమును సర్వముజేసిరి సర్వతంత్రముల్
వెలసెను మంత్రయుక్తముగ వేడబ మేమియు లేదువిఘ్నము
ల్గలగవు సర్వమానవులు గాంచిరి తృప్తిని భోజనాళిలో
నలయికడప్పి యాకలియు నందినవాడటలేడ కోటిలోన్ ౨౦౫

ఉ॥ అందరు సర్వవేదవిదులందరు వందల మీరు శిష్యులం
బొందుగ నేలివిద్యలను బూర్ణముగాగను నేర్పువారలే
యందరు సర్వయజ్ఞముల సద్భుత తత్వ మెరుంగువారలే
యందరు బ్రహ్మతత్వవిదు లందరు యోగవిదగ్రగణ్యులే॥ ౨౦౬

ఉ॥ కూరలు సన్నయన్నములు కోరెన భక్ష్యము లాజ్యసూపముల్
సారెకు పచ్చడు ల్దధియు జక్కగ పంక్తుల వెంటవడ్డనల్
పారులు జేయుచుండగను బారులు దీర్చి యనేక కోటుల
వ్వారిగ సర్వమానవులు నారని ప్రేమ భుజించి రొప్పుగన్॥ ౨౦౭

క॥ ఆదశరధ యజ్ఞంబున
వేదంబులు రానివాడు వెదకిన యొకడున్
మోదముతోడుత గాంచగ
నాదట లేడయ్యె యధికులచ్చటి విప్రుల్॥ ౨౦౮

ఉ॥ వీరలు వారలంచనుచు వేరుగ జెప్పగ నేల యందరుం
జేరల గార నాజ్యములు జెప్పగ శక్యము గాని భక్ష్యముల్
వారని యన్నపానములు వల్చిన పప్పులు లేహ్యచోష్యము
ల్భూరిగ ముక్కబంటిగను బొజ్జల నింపిరి తేన్చిరందరున్॥ ౨౦౯

క॥ యాచకులు నూతనంబగు
యోచనచే మునుల మిగులు యోగముచేతన్
ధీచతురత సమకూర్చిరి
యీ చతురత్వంబు గలదె యొచ్చట జగతిన్॥ ౨౧౦

గీ॥ వలదు సూపంబు దుగ్ధంబు వలదు దధియు
వలదు ఖాద్యంబు భక్ష్యంబు వలదు ఘృతము
పొట్టబరువెక్కె దినలేము పూర్ణతృప్తి
నందినారము చాలు మాకన్న మికను॥ ౨౧౧

గీ॥ ఎట్లు జేసిరో పాకంబు లెవని కెఱుక
మెన్నడెరుగని రుచి చేత నేపుమిగిలె
దినుచు దినలేక విడలేక దేన్చి దేన్చి
లొట్టలిడుచుండిరందరు లోలులగుచు॥ ౨౧౨

గీ॥ ఆశ మిక్కిలి యధికమై యలవరింప
విస్తరాకుల విడలేక వివిధజనులు
బహువిధాన్నము పానము బరపు ప్రీతి
గనుల భక్షించుచుండిరి కాంక్షచేత॥ ౨౧౩

క॥ నలపాక మొకటి భూమిని
వలతులచే జెప్పబడును వరమని మిగులన్
నలపాక రుచిని మించిన
యల రుచి గల దిందటంచు ననిరి యభిజ్ఞుల్ ౨౧౪

క॥ కుడువంగ లేక విస్తరి
విడువంగా లేక రుచికి వేడుక బడియా
యడియాస వదలనేరక
నడియాడెడి మనసుతోడ నరులుండిరటన్॥ ౨౧౫

క॥ నానాదేశాగతులగు
మానవతీ మనుజ తతులు మధు రుచిరములౌ
పానాన్నంబుల మెక్కుచు
నానాగతి జేసినారు నవ్య స్తుతులన్॥ ౨౧౬

శా॥ భద్రంబద్ధి జనాళి కల్పకతరో భాస్వత్ప్రతాప ప్రభో
ఛిద్రంబించుక లేక నీ క్రతువు వే శ్రీదంబ శీఘ్రంబయా
భద్రానందము నొందినారము మహాభవ్యుండవై వెప్పుడున్
మాద్రిన్మీరితివయ్య సర్వవిధుల న్మాన్యస్వర్షులం గొల్చుటన్॥ ౨౧౭

క॥ మామా పూపము సూపము
మామా పరమాన్నమికను మాదధిఘృతముల్
మామా దుగ్ధోదనములు
మామాయని గూత వెట్ట మానుదురంతన్॥ ౨౧౮

గీ॥ ప్రతిదినము సంస్థరంబున పరమ మునులు
శాస్త్రచోదిత కర్మల జరుపుచుండ
గనుల పండువు గాగను గడచె క్రతువు
సర్వమంగళ సద్వస్తు సంయుతంబు॥ ౨౧౯

వ. ఇట్లధిక విభవంబున నాయాగంబు జెల్లుచుండగా నూపో ప్రయకాలం బాసన్నంబయ్యె. రజ్జుదాల యూప మగ్నిస్థాన వేదియందు ప్రథమ యూపముగ నిలిపిరి. దీనికి దక్షిణోత్తర పార్శ్వముల రెండు దేవదారు యూపములు ఆ మూటికి దక్షిణముగ మూడు యూప ములు బైల్వములు. ఉత్తరముగ మూడు యూపములు బైల్వములు. ఈ తొమ్మిది యూపములకు దక్షిణముగా మూడు ఖాదిరములు. ఉత్త రముగా మూడు ఖాదిరములు. యీ పదిహేను యూపములకు, దక్షి ణముగా మూడు పాలాశములు, ఉత్తరముగా మూడు పాలాశములు. మొత్తము యిరువదియొక్క యూపములు. యూపము లన్నిటికిని సమానముగా నేకవింశ త్వరత్ని పరిమిత మధ్య ప్రదేశములు మధ్య విడువబడినవి. (అనగా చేతులుచాచి యందుకొనతగినంత దూరము గలదు) యూపంబుల కన్నిటికిని వస్త్రాభరణంబు లలంకరించబడినవి. గంధ పుష్పాదు లొనగబడినవి. అన్నియు నన్యూనాతిరిక్తములు. సుషిరాది దోష వర్జితములు. అష్టకోణంబులు, సుస్నిగ్ధములు నయి సప్తర్షులవలె ప్రకాశించు చున్నయవి. యూపసంస్థాపనకు పూర్వమె చయనంబు గావింప నెంచి ప్రమాణ విశిష్టములైన యిష్టికల నగ్నాక్షి

గారవేదియందుపధానంబుజేసిన యది స్వర్ణగర్భంబై స్వర్ణపక్షంబై య[illegible] దృష్టిగలదై ప్రాఙ్ముఖంబై యష్టాదశ ప్రస్తారాత్మకమై ప్రసారితపక్ష పుచ్ఛములుగల గరుడాకృతిగలిగి యొప్పుచుండె. పూర్వోక్త యూపములం లందు యింద్రాది దేవతలనుద్దేశించి గ్రామ్యపశువితతి బంధించిరి. ఆరోకములయందు సూకర పన్నగ [illegible] గణమ్ముల నిలిపి బంధించిరి. ఇందశక్యములగు సర్పాదులు పంజరములం బంధింప బడినవి. ఇందు పర్యగ్నికృతములైన యారణ్యకములు విసర్జించిరి. యూపముల బంధితములగు గ్రామ్యములు, త్రిశతములు, అవి [illegible] మిత్రకర్మోపయుక్తములు. అశ్వమేధమున పశుసంఖ్య [illegible] వింశతి, అశ్వరత్నము నియతమైయున్నయది. అప్పుడు ఋత్విక్శ్రేష్ఠులు [illegible] యాగీయ హయరత్నమును కూర్మాది జలచరంబులను గ్రామ్య పశు జాతమును విశసనార్థమాయత్తపరచిరి యూపనిబద్ధములగు మున్నూరు ప్రధాన పశువులను సర్వరత్నవిభూషితమగు హయరత్నమును విశసించిరి. కౌసల్యాది రాజపత్నులు వావాత పరివృత్తిమహిషులు, శాస్త్రోక్త[illegible] మున మృతినిబొందిన హయముచెంతకేతెంచి సవ్యాపసవ్యంబుగ [illegible] క్రమంబున పరిచరించి నిరపేక్ష శ్రద్ధచేత సౌవర్ణములగు సూదుల మూటిచేత నశ్వమున కసిపథంబులు కల్పించిరి. అంత మనస్విని [illegible] వ్రతాతిలకమగు కౌసల్య ధర్మసిద్ధి[illegible] మృతతురంగ శరీర స్పర్శకు జుగుప్సాయత్తచిత్తగాక సయ్యశ్వంబుతోడ నొకరాత్రినివసించె. యజ్ఞము తత్కాల దక్షిణకుగాను దశరథునివలన మహిషిని బ్రహ్మయు వావా తనుహోతయు పరివృత్తి నుద్గాతయు పాలాకలిని యధ్వర్యుడు క్రమంబున పరిగ్రహించి భర్తయుంబోలె హస్తగ్రహణంబొనర్చిరి. దశరథునివలన ప్రతినిధి ద్రవ్యంబుగొని వారల గ్రమ్మఱనాభూపాల తిలకున కొసంగిరి. అంత నధ్వర్యుడు హయవపనాకర్షించి నియమిత

సర్వేంద్రియుడై యగ్నియందు శ్రీపణంబుగావించి వేదోక్తవిధుల హోమమును జేసిన నాడయ్యెను.

గీ॥ ధర్మములనెల్ల నెరిగిన దశరథేంద్రు
డొప్పుచున్నట్టి యవ్వపా హోమధూమ
గంధ మాఘ్రాణ మొనరించి కలుషవితతి
యంతయునుబోవ మిగుల కృతార్థుడయ్యె॥ ౨౨౦

గీ॥ పదియాఱ్వురు ఋత్విజు ల్పదిలముగను
వాజియంగంబులన్నియు వహ్నియందు
పచన మొనరించి వేల్చిరి పరమనియతి
యగ్నియందున తచ్ఛేషమర్పికిశిక॥ ౨౨౧

గీ॥ అన్యపశువుల వపవేల్చ నగ్నియందు
ప్లక్షశాఖను పెట్టుట బరమనియతి
అశ్వమేధాశ్వ వపవేల్చ యగ్నియందు
నైతసకిటంబు గ్రాహ్యంబు నైనుకముగ॥ ౨౨౨

వ. నాశ్వస్యవపా విద్యతే అను సూత్రమువలన నశ్వమునకు వపయుండదు. వపాస్థానీయ్యమగు తేజనినియనగా చంద్రాఖ్య మేదస్సు వపాస్థానమున గ్రహింతురు. అశ్వమేధము బహుదినసాధ్యమై నందు ప్రధానదినములు మూడు. చతుష్టోమాత్మకంబగు జ్యోతిష్టోమంబు ప్రథమాహము, ఉక్థ్యంబు ద్వితీయాహము; అతిరాత్రము తృతీయాహము. ఇట్లశ్వమేధము సంపూర్తిగావించె శాస్త్రాంతర దర్శనమువలన విహితములయిన యితరయజ్ఞములను అశ్వమేధాంగ భూతములు జ్యోతిష్టోమా యురతిరాత్రి ద్వయాప్తోర్యామాభిజిద్విశ్వ జిత్తులను నారు యజ్ఞములను గావించె. నంత దశరథ రాజేంద్రుడు యాగదక్షిణల నివ్వదలపెట్టె.

సీ॥ ప్రాగ్దిక్కు హోతకు బ్రహ్మకు యామ్యంబు
పశ్చిమ మధ్వర్యు పాదునకును
నుత్తరముద్గాత కుత్తమరీతిని
ధరణియంతయునిచ్చె ధరణీవిభుఁడు
తాపసులప్పుడు ధరణీశునిగాంచి
వనవాసులము మాకు వసుధయేల
క్షత్రియముకు నీకిద్దె ఖ్యాయపర్చితిమయ్య
కొనవయ్య వేగమే కోర్కెలిచ్చి

గీ॥ యావులొక కొన్ని బంగారమనియు కొంత
రత్నములుకొన్ని దయచేసి రాజరాజ
నీవెయేలుము భూమిని నియమముగను
సత్యధర్మానువర్తివై శాశ్వతముగ॥ ౧౨౩

ఉ॥ కోరినకోర్కె లిచ్చుటయె కోటిగుణంబులు విప్రకోటికిన్
పారులుభూమినేలుదు రె పార్థివలోకము భూమిలోకమున్
సారస మిత్రవంశభవ చారునిలాసముతోడ నేలుమీ
వారని ప్రేమ నీసుతులు వారిరినేలుదురయ్య నీవలెన్॥ ౧౨౪

మ॥ ఒల్లముభూమి నేలుటకు నొల్లముపొట్టకు మించు భాగ్యముల్
పొల్లులు బల్కువారలమె పోషణజేసెన వీవెమమ్ములన్
కొల్లగ సొమ్ములేల నిమకొంత సువర్ణము కొన్ని రత్నముల్
మొల్లములైన గోవులను మోదము నొందవమయ్య భూవరా॥

మ॥ అను చిట్లాడిన విప్రవాక్యముల కల్లోగాక యంచాన్రుపుం
డనువా గోవులగోటిసంఖ్య శతకోట్యుత్యుత్తమ స్వర్ణముల్
ఘనరూప్యంబులు నాల్గురెట్లిడగ కార్యజ్ఞులౌ ఋత్విజుల్
గొనియర్పింప గురుండు బ్రహ్మయును చేకొంచప్పుడే వారికిన్॥ ౧౨౬

గీ॥ భాగముల బంచి శాస్త్రోక్త భవ్యరీతి
నెవరిభాగంబు వారికి నివ్వగానె
వారుమిక్కిలి తృప్తులై వరుసతోడ
నరిరి "తృప్తాస్మ" యనరాజు హర్ష మొంద॥ ౨౨

మ॥ క్రమవీథా పరతంత్రులైన ప్రజలన్నారణ్యా మేపారగా
నతిమూల్యోత్తమ వస్త్రసంఘముల సర్వాభీష్ట దానంబులన్
మితిలేనట్టి సువర్ణ రూప్యముల నెమ్మిన్గోకణౌఘంబులన్
ప్రతిలేనట్టి ప్రశస్తసన్మణుల సంభావించె రాజేందరన్॥ ౨౨

మ॥ ఘనదానంబుల నెల్ల వారలను సత్కారంబులన్జేయుచున్
వినయం బొప్పగ జేరి భక్తిపరుడై విశ్వాస పూర్వంబుగా
ననువొప్పంగ వినమ్రుడై నిలువగా నార్యుల్కృపాదృష్టిచే
గనుమీ భద్రములంచు బల్కిరి నృపున్గాఢాను రక్తాత్ములై॥ ౨౯

వ. మరియును,

గీ॥ అభిమతార్థము సిద్ధించు నఖిలనాథ
రాజశేఖర రాఘవ రాజరాజ
యనుచు విప్రులు దీవించ నవనివిభుడు
వారి కర్పించె దండంబు వరుసతోడ॥ ౨౩౦

వ. అంత దశరథ మేదినీకాంతుండు విభండకసూనునిం గనుంగొని వశిష్ఠానుమతంబున నిట్లనియె,

చ॥ మిహిరుడు మూలపూరుషుడు మిత్రుడు మాకు నరుంధతీశ్వరుం
డహితుడు లేడు లోకమున నధ్వరముఖ్యుల దీర్చినారుగా
విహితమువంశవర్ధనము విఘ్నలు మీరలు వేడుచుండిరిన్
రహిగరుణాకటాక్షమున రాఘవ వంశము నిల్ప బూనుడీ॥

చ॥ అరువది వేల వత్సరము లద్భుత వేగము తోడ బోయె నా
కరయగ నాత్మ జాతు డొకడైనను గల్గడి దేమి చిత్రమో
పరమ దయాంతరంగ! యిక భవ్య కటాక్షముతోడ సూనులన్
స్థిరముగ గూర్చు మార్గమును తీపగ ద్రొక్కి యనుగ్రహింపవే॥

గీ॥ మనుదిలీప రఘువులను మదిని దలచి
నాదు వృత్తంబు దలచక నవ్యమగుట
వారి వంశంబు నిలుపుము వరద! నీవు
మదిని దలచిన వన్నియు మహిని గలుగు॥ ౨౩౩

క॥ కులవర్ధనులగు సూనుల
గలిగింపగ నీవె కాక గలరే యితరుల్
లలి నన్ను ధన్యు జేయగ
దలపుము నీవనిన మునియు శ్రద్ధయు బలికెన్॥ ౨౩౪

క॥ కులవర్ధనులగు బుత్త్రులు
నలుగురు గలుగుదురు నీకు నరనుత వినుమా
నలిపెద నిష్టిని వేగమె
గలకాలము చింతలేక గడపెద వింకన్॥ ౨౩౫

క॥ కలదొక యిష్టియు వినుమీ
వలనొప్పగ జేయ దాన వరసుతచయమున్
గలుగును గావున నిప్పుడె
నలుపంగావలయు దాని చతురత యనినన్॥ ౨౩౬

కం॥ మునివాక్యము విని మోదము
గనిభక్తిని గురునితోడ గడువడి బలికెన్
మనమున దీనిని దలచుము
తనయుల దయసేయ నీవు త్వరపడవలయున్॥ ౨౩౭

క॥ మీరియవ్వరు యీభారము
ధీరతబూనంగవలయు ధీయుతులారా
కారణ మెఱిగినవారలు
వేరుగనిట్లుండనేల వేబూనుడికన్॥ ౨౩౮

చ॥ అనవిని వారలిద్దరపు డాదరమొప్ప నధర్వణంబు నం
దునగల మంత్రతంత్రముల దూర్ణమ యిష్టిని జేయుచుండగా
నినకులు యజ్ఞభాగముల కింపుగ జేరిన దేవతావరుల్
ఘనుని సరోజజాతుగని గ్రక్కునజేరి వచించిరొప్పుగన్॥ ౨౩౯

చ॥ వరములగోర లేదనవు వారిజసంభవ దానరావణుం
డరమరిలేక నిర్జరుల నందరగెల్చి సమస్తబాధలం
బరపుచు నున్నవాడు భయభావనచే శరణంబువేడగా
కరమనురక్తిచేరితిమి గావగదే శరణార్థులన్మమున్॥ ౨౪౦

ఉ॥ పారులజంపినాడు పరభామల మిక్కిలిబొందినాడు గా
క్రూరుడు ధర్మదూరుడును గోవుల సాధుల గూలదన్ను వా
డారని చిచ్చుమాకత డనార్యుడు నీవ యిట్లునుండెదాన్
కారణమేమిలేక గడుగారియబెట్టెను సర్వభంగులన్॥ ౨౪౧

ఉ॥ వానికి నింద్రుడోడెనిక వహ్ని గతింబడెంపనేల నా
భానుసుతుండుబారె బసిబాలుని భంగిని దాగెదైత్యుడు
న్మానినియయ్యెపాశి మతిమంతుడు వాయువు మందగించె నీ
దీనునిగాంచుమీ ధనదుడీవ్రత శంకరుపాత్రయించెబో॥ ౨౪౨

సీ॥ తపనుడతనిపజ్జ తగిపట్లునడచును
గాలివిసరబోడు గంధవహుడు
పారిజాతంబుల భయమున బుచ్చుచు
శక్రుడు సేవల జరుపుచుండు

సురవరులందరు సురటీలు వేయుచు
రమర మునులతని నాశ్రయింతు
రేలోకమందైన నెదురించగలవాని
గనలజూడగలేదు కమలనాభ

గీ॥ వాని బరిమార్చుమార్గంబు నలుక వేమి
పరులమా? మేమునీపదభక్తియుతుల
మేలగావవు! మము నిట్లులేల నీచ
సాధజనబాధజూచుట సంతసంబె॥ ౨౮౩

క॥ రావణు డెవ్వనిచేతను
చావగ నున్నాడో వాని సరసన చెప్పుమా
గావగ లోకుల నెంచుచు
తావక వరదాన మహిమ దలపగ వశమా॥ ౨౮౪

సీ॥ నిర్జరులిటు వేడ నీరజ జాతుండు
దేవతా తతితోడ దేటగాను
వరముగోరెడు వేళ కరమనురక్తిని
గంధర్వదైతేయ గరుడ యక్ష
దానవరాక్షస దైత్యేంద్రుల వలన
మరణంబు లేకుండ మమ్ముగోరె
నరుల వానరులను పరగగోరగ లేదు
నరవానరులచేత నాశమొందు

గీ॥ పరులు జంపగ లేరని బలుకగానె
యమరులందరు సంతోషమంది మిగుల
మునులతో గూడి మంతనములను జేసి
రక్షకావేక్షులై యుండ రభసముగను॥ ౨౮౫

క॥ ఆలోన రమాద్వైతుడు
వాలాయము గాగవచ్చి వనజజుచెంతన్
శ్రీలోలుక నిలువ నమరులు
ఫాలంబులు సోక భక్తి బరపిరి నతులన్॥ ౨౮౬

క॥ కరుణాకర శరణాగత
భరణోచిత సకల భువన పాలన దీక్షా
చరణోద్ధత దనుజాహిత
శరణార్థుల మమ్ము గావు సారసనేత్రా॥ ౨౮౭

సీ॥ బుధజనచయ వనంబులు పల్లవిల జేసి
మాధవ నామంబు మహిని గనియె
కోమరొప్పు నతజన తమముబాపుటచేత
గలిగె విధుండను క్రమపదము
సజ్జనహృత్పంకజము వికసిలజేసి
హరిపద వాచ్యుడై యమరె మిగుల
విశ్వంభరను దాల్చి విశ్వేశుడై యుంట
దగ ననంతాఖ్యను దాల్చ గలిగె

గీ॥ గదయు చక్రంబు శంఖంబు ఖడ్గవరము
కౌస్తుభంబును వనమాలికలును రమయు
శార్ఙ్గమును హైమపటమును సరసిజంబు
కలుగు శ్రీవత్సలాంఛన కలుతుడితడు॥ ౨౮౮

క॥ ఈవిధమున దయచేసిన
శ్రీవల్లభు గనులగాంచి చేతఃప్రీతిన్
భావజ రిపుడును ధాతయు
దేవతలును బల్కిరిట్లు దీప్తాంజలులై॥ ౨౮౯

వ. శ్రియఃపతే సర్వేశ్వర సర్వస్వతంత్ర సర్వాంతర్యామిన్ సర్గస్థితి
సంహారకారణాఖిలహేయప్రత్యనీకకల్యాణ గుణామహోదధే ఆది
మధ్యాంతరహిత శ్రీవైకుంఠనికేతన శ్రీవత్సాంగాంకస్ఫుర శ్రీభూనీళా
పరిచరితపాదయుగళ సర్వవ్యాపిన్ సర్వసయావాక భక్తావనదీక్షిత భక్త
సులభ భక్తపరతంత్ర భక్తాభీష్టప్రద ఖిలవనదాపదహాన దానవాంతక
నమస్తే నమస్తే శతకృత్వస్సహస్రకృత్వః॥

సుగంధి॥ మమ్ముఁగావు దేవదేవ మాసటి పొగిసే
తెమ్ముపాదయుగ్మ మీశ తేటగాగ గొల్వగా
నమ్ముమీ దయానిధాన ఘనార్తిచే సుశీతిచే
మిమ్ము జేరగావవేని మేలుగూర్పు సత్కృపన॥ ౨౫౦

క॥ రావణుడు వరమదంబున
దానవయూథంబుతోడ దశదిగ్వనితా
భావము దూలగజేసెను
తావకజని చేతవాని దగగూల్చుమికన్॥ ౨౫౧

చ॥ శరణనివేడువారలకు సర్వశుభంబులగూర్చు దీక్షచే
వరలెదవంచు వేదములె బల్కుటతెల్లముగాన నేస్వామిను
కరములుమోడ్చి నీచరణకంజయుగంబుల నాత్మగొల్చుమా
కరయగరావణాసురుడు కష్టపరిస్థితిగూర్చె గావవే॥ ౨౫౨

ఉ॥ ఊహయొనర్పడో యతిశయోక్తులకెక్కడ స్థానలేక నో
సాహసమిట్లుజేయుచును సాధులనేచగ దుష్టరాక్షస
వ్యూహమువృద్ధిజేయుటకు వ్యగ్రతమందుష్ట వరంబులిచ్చి యు
వ్యాహతిచేత నీసుతుడు వ్యక్తమునీకృప నిట్లుజేసెనిన్॥ ౨౫౩

గీ॥ ముక్కుమూసినమాత్రాన మూర్ఖులైన
వారికిచ్చును వరములు వనజభవుడు

మూడుజగములు దుఃఖాబ్ధిమునిగియెప్పు
డిద్దుబాటును జేయంగ దిక్కునీవు॥ ౨౫౪

గీ॥ గొప్పవానికిగలిగిన కొడుకుగాన
దాసులందరగాచుట ధర్మమగును
యిట్టిదుష్టులచేనమ్ము నేచకుండ
గావుమిప్పుడేకమలాక్ష కరుణతోడ॥ ౨౫౫

సీ॥ మునులెప్పు డడవిలో ముక్కు మూయగరాదు
దేవత లెక్కడ దిరుగరాదు
యజ్ఞ మెక్కడనైన నవ్వుల బడరాదు
తెరగంటి వనితలే తేరరాదు
గంధర్వగానంబు కర్ణంబు సోకరాదు
నందనంబు బూనను నల విధేయ
సురలు హవిస్సులు గొరగూడ దెప్పుడు
వజ్రి యొక్కడె కేగ వలనుపడదు

గీ॥ యేమి చెప్పుదుమో యయ్య! యిట్టి కష్ట
నష్టములతోడ నీప్రతి నవయుచున్న
మమ్ము గావంగ దలచుము మనసునందు
నీవె పరగతి మాకెల్ల నిత్య విభవ॥ ౨౫౬

క॥ అరిమర్దన మొనరింపగ
బరమాత్ముడవైన నీవె పరమాత్ముడవై
నరవేషధారివగు మిక
శరణార్థుల మమ్ము గావ శతధృతి జనకా॥ ౨౫౭

చ॥ అడజడిబల్కె ధాత పరమార్థికి నిచ్చితి మందబుద్ధినై
పుడమిని నాకలోకమును పూర్ణముగాగను బుగ్గిసేయగా

గడగెను వాని ద్రుంచుటకు కాశ్యపి బుట్టి కకుద్గ్నవంశమున్
కడువడిగావ గావలెను కంజదళాక్ష! కిరంబు మోడ్చెదన్॥ ౨౫౮

ఉ॥ ఓనలినాక్ష! నన్గరుణ నోమగ నెంచెద వేని వేగమే
మానవ జన్మ మెత్తి మటుమాయలమారని రావణాసురున్
సూనులతోడ ద్రుంచి రవిసూనుని లోకము జూడ బంపుమీ
భానుకులంబు నీజనికి భాజనమై తగియుండె నీతరిన్॥ ౨౫౯

చ॥ అనవిని శంకరుండనియె నచ్యుత విన్నప మాలకించు మీ
ఘనుడితడిష్టి నీకరుణ గాంచ సుతాళిని బొంద జేసె నీ
వనితర లభ్యమౌ జనిని యద్భుత మీతని భార్యలందునన్
గనగ ననుగ్రహింపు మిక కాంచనచేల జగంబు గావగన్॥ ౨౬౦

చ॥ మునులు వినమ్రులై హరికి మ్రొక్కులు దైత్యులు మమ్ముసర్వదా
ఘనమగురీతి బాధలను కాననమందున బెట్టిరార్చటి
న్మనమున శంకలేక సుసమాధి నివిష్టుల గూల్చి రుగ్రులై
యనయము యజ్ఞవిఘ్నముల నజ్ఞత జేసిరి వాని గూల్పవే॥ ౨౬౧

గీ॥ తార్క్ష్యవాహన దశరథ తరుణులందు
సుతుడవై బుట్టి రావణు సుతులతోడ
వేగకడతేర్చవలయును వేదవేద్య
మాకు శరణంబ వగుమయ్య మాన్యచరిత॥ ౨౬౨

చ॥ అనవిని సర్వరక్షకుడు హర్షముతోడుత పద్మజాదులన్
గనుగొని భీతినొందకుడు కాశ్యపిబుట్టుదు మానవాకృతిం
దనుజుల రావణాసురుని తత్సుతుల న్వధి యుట్టగూల్చెదం
మనమున శంకవీడుడిక మంచిగగల్గుసుఖంబు మీకికన్॥ ౨౬౩

గీ॥ అభయమిచ్చితి భయమేల నమరులార
సకల శుభములబొందుచు స్వర్గమందు

నిజగృహంబులనుండుడు నిశ్చలముగ
శత్రుసంహారమైనట్టి సంతసిలుడు॥ ౨౬౪

గీ॥ కాలమొకరీతిగడువదు గానమీరు
విషమదశయందుగష్టముల్విపులముగను
బడగరానట్టివిధమున బడితిరయ్య
మేలుకాలంబుచేకూరె మేలుగలుగు॥ ౨౬౫

మ॥ ప్రకటాటోపుని రావణాసురుని దీవ్రాస్త్రాళిచేద్రుంచి నే
నకలంకంబుగ మేదినిన్గలిగి దేవానంద సంధాయినై
సకలోర్వీన్నృపకోటివేల సమముల్సమ్యక్క్రతూపాస్యతే
సుకరంబై తగురీతి నేలుచును సౌసభ్యాన్యశ్రీలచేన్॥ ౨౬౬

మ॥ అనియీరీతి వరంబులిచ్చి కృపచే నాదిత్యులుప్పొంగగా
ఘనమౌ మానవజన్మ మెత్తుటకు సంకల్పంబుగావించి పా
వనరూపంబు చతుర్విధాత్మలను భావంబందు భాగించి మే
దినియేవంశము జన్మకుందగునో యందేబుట్టగా నెంచుచున్॥ ౨౬౭

గీ॥ వినవడిగెద శంకరు నబ్జభవుని
శక్రుసమరుల ననిచల్చి చక్రపాణి
యేయుపాయంబుచేవిని యేఘమాప
దగునోమీరలుబలుకుడు దానినిపుడె॥ ౨౬౮

చ॥ అనవిని వేదవాక్యముల నచ్యుతుసన్నుతిజేసి దేవతల్
మనమున మోదమందుచును మాధవ! మానవజన్మమెత్తుమీ
దనమనమందురావణుడు గెల్చెను మానవులల్పులంచు దా
ఘనవరలబ్ధికాలమున గర్వితుడై విడనాడె మర్త్యులన్॥ ౨౬౯

ఉ॥ తేకువ పెక్కువర్షములు తీవ్రతపంబొనరించి పద్మజుం
లోకువజేసి లోకములలోలత బాధలపెట్టి మిమ్ము న
ట్టాకలబెట్టె దుష్టుడగు రావణుడెంతటి క్రూరచిత్తుడో
వీక దయారసంబునను వేగమ మానవరూపుదాల్చవే॥ ౨౭౦

సుగంధి॥ భూమినంతయు నేలువాడు భూభుజుండు వేడుకన్
కామితంబునొందగా బ్రకామమిష్టిని జేసెబో
సామగానలోల! వేగ సత్సుతాప్తిమూలమై
భామలందు నీవుబుట్టి భారమంతయు దీర్పవే॥ ౨౭౧

వ. అని సుపర్వాణులు విన్నవించిన సర్వజ్ఞుండగు శ్రీమన్నారాయణుడు వసుమతియందు మానవరూపంబున నవతరించుటకు నిశ్చయించుకొని,

గీ॥ సంతతిగోరి యర్చించు సత్వగుణుని
దశరథాహ్వయు ధర్మజ్ఞు తండ్రిగాగ
దనమనంబున దలచెను దశరథుండు
సర్వమెరిగిన సంపూర్ణశక్తుడగుట॥ ౨౭౨

వ. అపుడు నారాయణుండు విబుధవరుల నవలోకించి మీరు వచించిన వాక్యంబుల తత్వమెఱింగితిని. యిక మీయభీష్టంబు ఘటింతును. మీకు మేలుగలుగును. నేను దశరథునకు పుత్రభావవిశిష్టయరూపంబున నవతరించి సపరివారుడగు రావణునిబరిమార్చి లోకులకానందానందంబు సంపాదించెదనని యభయదానంబొసగి ధాతృముఖదేవబృంద వంద్యమానపదద్వయుడై యంతర్ధానంబుజేసె. బృందారకులందరు దమ తమ భాగముల బరితృప్తులై రావణునివలన దమకుభయమిక గలుగబోదని భావించి సంతసించిరి.

గీ॥ పుత్రులనుగోరి దశరథభూవిభుండు
గురువుచెల్పినవిధమున కుదురుగాను
వేదవిహితంబులగు మంత్ర వితతినియతి
దవిలి హోమంబుగావించు తరుణమందు॥ ౨౨౩

సీ॥ క జాతసఖుని యాకారంబుగలవాడు
జ్వలితాగ్ని శిఖవలె జెలగువాడు
నీలరక్తంబైన చేలంబుగలవాడు
కమనీయ్యరక్తాస్య కలనవాడు
దివ్యభూషలచేత దేజరిల్లెడివాడు
శుభలక్షణాఢ్యమై సొగసువాడు
మేరుశృంగముబోలి మెఱయుచుండెడివాడు
శార్దూల సమసాహసంబువాడు॥

గీ॥ బలము తేజంబు వీర్యంబు బడయువాడు
దివ్యరూపంబుగలవాడు దీప్తకనక
వర్ణయుక్తుండు దుందుభి స్వనమువాడు
చారుసుస్నిగ్ధ వరశిరోజముల వాడు॥ ౨౨౪

గీ॥ నిరుపమాన ప్రభాన్విత నరుడొకండు
దివ్యపాయస యుక్తమౌ దీప్రకనక
పాత్రగాంతను బలె బట్టి బాహుయుగళి
దర్శనంబిచ్చి వినజెప్పె దశరథునకు॥ ౨౨౫

క॥ ఘనయాగ దీక్షితుండవు
తనయులకై హోమమిట్లు తప్పకవిధులన్
మనమలర జేసినాడవు
గనుమిక సత్పుత్రతతిని ఘనమోదమునన్॥ ౨౨౬

వ. అని బలికిన విని దశరథుండు వినయంబున కరములమోడ్చి సంతుష్టాంతరంగుడై.

చ॥ అనఘుడు భక్తిమ్రొక్కులిడి యద్భుత హర్షములొక్కరీతిగా
మనమున దొంగలింపగను మన్ననజేయుచు బల్కెనేనికన్
వినయము తోడ జేయదగు విస్తృతకార్యము జెప్పవేయనన్
ఘనమిది దివ్యపాయసము గ్రక్కున దీని పరిగ్రహింపుమీ॥ ౨౭

చ॥ ఎసగిన భక్తిచేకొనుము హేమఘటంబున నున్న దీని నీ
కొసగగ దెచ్చితిన్శుభము నూర్జిత భాగ్యము సత్సుతోదయం
బసమ మనామయంబు నతి హర్షము గల్గును ప్రేయసీ సతీ
వినరము భక్తిపై మెసగ వేగమ నిమ్మిక గోర్కె దీరెడిన్॥ ౨౮

వ. ఓ మహారాజా! దశరథరాజా! భవత్కృతమగు నీ యిష్టికి దేవేంద్రాది సర్వదేవతలను సంతసించి నిన్ను కరుణించి యీ కాంచన పాయస పాత్రను నీకు బంపిరి. ఈ పాయసము పుత్రీయము, సర్వ సంపత్ప్రదము, శుభదము. గాన సత్వరముగ దీనిని గొని చని నీ సతుల కొసగుము. నీ పత్నులు భక్తిని దీనిని భుజించి సత్పుత్రవతు లగుదురు. పొమ్మని బలికి యా పాత్రను దశరథుని కొసగి యా భూతము దన పదమున కేగెను. అప్పుడు దశరథుడు

క॥ కడుపేదకు నిధి యబ్బిన
వడువున సంతోష మందె వర నృపు డంతన్
వడి దన కాంతల చెంతకు
కడు ముదమున నతడు వోవ కాంతలు మిగులన్॥ ౨౯

వ. తమ సన్నిధానముకు దయచేసిన భానుకులావతంసంబగు దశరథమహారాజును వీక్షించి భయభక్తుల బ్రణమిల్లి దమ కాంతుని

తోడ నంతఃపురంబును ప్రవేశించిరి. దశరథుఁడు శరద్రాకా శశాంకుఁడు నిజకరంబుల నభంబును బోలె నిజాభరణద్యుతుల నంతఃపుర వరంబు బ్రకాశిల్ల జేయుచు,

చ॥ ఎసఁగు వికాస భాస్వర ముఖేందులు పత్నులు సంతసిల్లగా
లసదసమాన విక్రముఁడు లక్షణయుక్తుఁడు రాజు వేగమే
హసితముఖుండు రాఘవుఁడు హరివచో విభవాతిశాయియై
కుసుమసమాన దేహయగు కోసలరాజ తనూజతోననెన్॥ ౨౮౦

క॥ సతి యిది పుత్రీయము సుమి
యతిపావన మమృతతుల్యమగు పాయసమీ
వతిసంభావన జేయుము
సుతవతివై యలర గలవు సుశ్రీయుతవై॥ ౨౮౧

క॥ అని బలికి ధర్మ తత్త్వము
మనమున భావించి రాజు మన్ననతోడన్
దన పత్నుల మువ్వురగని
ఘనపాయసమిట్లు బంచి కాంతల కిచ్చెన్॥ ౨౮౨

దైవప్రేరిత పాయస విభాగక్రమము

గీ॥ సగము కౌసల్య కర్పించె సగమునందు
సగమిడె సుమిత్ర కరమున సగమునందు
సగము కైకేయి కొసగి యాసగమునెల్ల
మిగులకుండగ నిచ్చె సుమిత్ర కతఁడు॥ ౨౮3

క॥ సుతులను బొందగోరి విభు
డతులాదరమొప్ప వేగ నట్లొసంగగా
సతులప్పుడె సేవించిరి
పతిభక్తియు రక్తి గలిగి భద్రాద్రినుతలై॥ ౨౮౪

ఉ॥ కాంతలు పాయసంబు నిజకాంతుని జూడ భుజించిరంత దు
ర్దాంత కృపీటయోని హరిదశ్వుని కాంతిరుచి ప్రశస్తముల్
శాంతసురాంగనా హృదయ సంతతతాప నిషేధనంబులా
శాంతసుకీర్తనీయ గుణతాంత సుగర్భములైన గర్భముల్॥ ౨౮౫

చ॥ సలలితగర్భభారయుత సాధ్వులగాంచి నితాంతహృష్టుఁడై
జలరుహ మిత్రవంశజుడు శక్రసమానుఁడయోధ్యనుండె నా
బలరిపుఁడు న్శచీయుతుఁడు భాసురనాకమునందు దేవతా
బలములు సిద్ధసాధ్య ముఖభవ్యులు గొల్వఁగ నుండురీతిగన్॥ ౨౮౬

గీ॥ దశరథుండప్డు క్షణమైన దారసతిని
విడువకుండగ సేవించె విమల యశుడు
రాజుదారల విడువక రక్తిదవిలి
నిత్యసేవల జేయుట నియతిగాఁగ॥ ౨౮౭

వ. మఱియు రాజదారలు నాయాయి గర్భలై యభూత పూర్వ
శోభా విశేషంబున ప్రకాశించుచుండిరి,

గీ॥ దేవహితమునుగోరుచు దైత్యహరుడు
రాజపత్నుల యందున రమ్యముగను
తనదు తేజంబు నిలుపుచు ధరణిధవుని
నమిత సంతోష పాథోధి యందు ముంచె॥ ౨౮౮

వ. అంత పద్మనాభుడు భూలోకమున దుష్ట సంహారమునకును
సాధు సంరక్షణకును, సూర్యవంశంబున నవతరించుట బరికించి
పరమానందభరంబున,

గీ॥ అమరులను గాంచి బలికె నాయబ్జభవుడు
భూమి భారంబు దీర్పగ పుడమియందు
శ్రీశుడుదయించె భక్తిని సేవజేయ
బుత్రులను గాంచుడిక మీరు పుడమియందు॥ ౨౮౯

గీ॥ కనులఁగాంచఁగ రానట్టి కమలనాభు
సేవఁజేసెడి భాగ్యంబు జెందవలెను
పూర్వమెప్పుడో జేసిన పుణ్యమిప్పు
పూజ్యపదమును బొందించె పూర్ణముగను॥ ౨౯౦

గీ॥ ఋక్షవానర లాంగూల రూపధరుల
బాహుబలమున నమరుల బ్రబలువారి
సకలశస్త్రాస్త్రవేత్తల సాధుమతుల
పుత్రవరులను గాంచుఁడు భూరిగాను॥ ౨౯౧

గీ॥ గరుడ గంధర్వకిన్నర కాంతలందు
వానర భుజగ భల్లూక వనితలందు
అప్సరో నాగవనితల నంచితముగ
పుత్రులనుగాంచ గావలె బుడమియందు॥ ౨౯౨

గీ॥ ఆవలింతగలుగ దాన సభకబలుకు
గలిగె జాంబవదాఖ్యుడు కార్యవినుత
లులిత శక్రుండు నాకు భల్లూక రాజు
వాడు మీతోడ గూడును సైన్యముగను॥ ౨౯౩

క॥ అని చెప్పి యజుడు పోయిన
విని దేవత లందరప్పుడు విక్రమబలులన్
దనయుల బరబుట్టించిరి
వనచర భల్లూకముఖ్య వనితలయందున్॥ ౨౯౪

చ॥ వనముల పర్వతాగ్రముల వాగుల వప్రల గొప్పయేరులం
గనఁదగు సన్నితావులను కాలునిబోలెడి వానరోత్తముల్
ఘనమగు బాహువీర్యమున కాంక్షితకార్యములెల్ల జేయుచున్
మనమలరంగ దేవతల మన్ననగాంచి చరింపరంతటన్॥ ౨౯౫

సీ॥ వాసవ సూనుడు వాలి యనెడు వాఁడు
సుగ్రీవుఁడనువాఁడు సూర్యసుతుఁడ
గురునకు తారుఁడు గురుమతి తనయుఁడు
విశ్వకర్మ నలుని వీరవరుని
గనియెను ధనదుడుఁ గంధమాదను నాము
వన్నిగనియె నీలువానరేంద్రు
మైందుడు ద్వివిదుడు మహితులు బుట్టిరి
యమర వైద్యులకును హరి గుణులు
గీ॥ ఆంజనేయుడు శ్వసనుని యాత్మజాతు
డమిత బలవంతు లాఘవ్య లపశౌర్యసిభులు
కామరూపులు శూరులు కాలసములు
వజ్రసన్నిభకాయులు వైరియములు॥ ౨౯౬

క॥ ఏ దేవుని కేతనయుఁడో
యా దేవత రూపశక్తు లాతని బొందెన్
దేదీప్యమాన దేహుఁడు
నా దేవత వలెనె వాఁడు వసుమతి వరలెన్॥ ౨౯౭

సీ॥ కిన్నరీ స్త్రీలకు కింపురుషాంగనా
మణులకు దివ్యర్షి మగువలకును
నాగాంగనాసిద్ధ నారీ మణులకును
తార్క్ష్యాప్సరస్త్రీల తండమందు
విద్యాధరాంగనా వితతికి మునియక్షు
భల్లూక గంధర్వభామలందు
గలిగిన తనయులు కాశ్యపినెల్లెడ
గనుల పండువుగాగ గంతులిడుచు

గీ॥ గోళ్లు శిలలును ద్రుమములు కోరలరయ
నాయుధంబులు గాఁగల్గి యస్త్రశస్త్ర
మర్మమెల్లను దెలియుచు మహితులగుచు
కామరూపులు శాస్త్రార్థ కలితమతులు॥ ౨౯౮

సీ॥ కొండల పిండిగఁ గొట్టంగ నేర్తురు
తరుషండముల గూల్చ దగినవారు
సాగరములరొంపి సలుపగ దగుదురు
మింటికెగసి సూర్యుమింగగలరు
చుక్కలదాఁకను చూరంత నెగురుచు
మేఘపంక్తులబట్టి మెలుఁగలరు
ప్రాగద్రిపైనుండి పశ్చిమాద్రిదాఁక
లంఘింపఁగలిగిన లలితవపులు

గీ॥ నిఖిలజగముల నొకసారి నియమగతిని
సంచరించగ జాలిన సత్వయుతులు
శూరులందర దోకలజుట్టికట్టి
విడిచిపెట్టంగ గలిగిన వీర్యయుతులు॥ ౨౯౯

మత్తకోకిల॥ అట్టివానర వీరులందున నాఖ్యలుత్తమ వీర్యులుం
యెట్టిశూరులనైన నేర్పున నేపడంచగ శక్తులుం
పట్టభద్రుల వార్యశౌర్యులు భానుపుత్రపురస్సరుల్
దిట్టలై కపిసేననెల్లను దిద్దిరుత్తమ పద్ధతిన్॥ ౩౦౦

గీ॥ శక్రపుత్రుని వాలిని శత్రురిపుని
సూర్యపుత్రుని సుగ్రీవు శూరువీరు
సన్నుదమ్ముల గొలిచిరి హరులుమసల
నీలు హనుమంతు నలనాము నిపుణమతులు॥ ౩౦౧

గీ॥ గరుడ సన్నిభవీరులు గలనహకుశలు
లర్థి తారాతి సంచయ లాఘ్యహేతులు
సర్ప కేసరి శార్దూల సత్వహారులు
సంచరించిరి కానల సరసముగను॥ ౩౦౨

ఉ॥ వారలలోన బాహుబల పరిపూర్ణుడు వాలి భుజాబలంబునన్
వారిత సర్వవీరుడును వానరజాతిక చక్రవర్తి సం
చారిత సర్వభూవలయ చారుపవిత్రయు డాత్మజన్మకుం
దారయు దాను తమ్ముడును తార యశోనిధియుండె సింపుగన్॥ ౩౦౩

ఉ॥ వానర సార్వభౌముడగు వాలి మహోన్నత రాజ్యవైభవా
ధీనమనస్కుడై వెలసె ధీసఖ సూర్యసుతుండు భక్తితో
మానుగ యౌవరాజ్యరమాన్యపు మంత్రులు నీలనామునం
ధీనిధులాంజనేయ నల ధీరముఖుల్గను గొల్చుచుండగన్॥ ౩౦౪

గీ॥ వాలి కిష్కింధయందుండి వాసవుండు
నాకమందున్న విధమున వ్యాప్తధిని
శాలియగుచును వర్తించె శస్త్రయుతుడ
విబుధవరులెల్ల దనుజూచి వెరగుజెంది॥ ౩౦౫

గీ॥ సకల సాగర గిరివర సహితమైన
విపులయంతయు కాంతనై వెలసెనట్టుల
వివిధ సంస్థాన సువివేక పర్యయుక్తి
వానరానీక సంసక్తి విభవమగుచు॥ ౩౦౬

గీ॥ హేమమాలిని వాలి సహసబలుని
గలన గలిసిన వీరులు కాలుసేవ
జేయబోవలె లేకున్న సిగ్గువిడిచి
వాలి సేవల జేయుచు వరలవలెను॥ ౩౦౭

గీ॥ రాజులందరు సత్కార రాజినంది
గురునిచరణంబు లర్చించి గూర్మితోడ
సంతసించుచు దమతమ సచివ సహితు
లగుచు నేగిరి పురములనమల గతిని ౩౦౮

గీ॥ రాజులేగిన పిమ్మట రాజరాజు
విప్రపుంగవ యాజ్ఞకై శీఘ్రముగను
జనయయోధ్యకు జేరెను దారయుతుడు
ధర్మపథమున నడిపెడి దశరథుండు॥ ౩౦౯

గీ॥ ఋష్యశృంగుడు జనియెను ఋషులతోడ
శాంతయును రోమపాదుడు చక్క నడువ
సకల పరివారములు తోడ సాగిరాగ
రాఘువార్చితుడై జనె రమ్య సరణి॥ ౩౧౦

క॥ సుత సంప్రాప్తిని గోరుచు
మతిమంతుడు దశరథుండు మానితపతియై
యతి సంతోషము తోడుత
సతతము సుఖశక్తి నచట చక్కగ నుండెన్॥ ౩౧౧

ఉ॥ కన్నులు చల్లగాను గసిగందుల నెన్నడు గాంచువాడ యిం
కెన్నడు గోర్కె దీరునని యెంచుచు నువ్విళులూరుచుండగా
క్రన్నన రాజపత్నులకు గర్భపు చిహ్నము లొప్పె వింతగా
మన్ను దినంగబూనిరి సమంచిత వాంఛలు హెచ్చె హెచ్చుగాన్॥

గీ॥ అంత వేవిళ్ళు గలిగె నాయింతులకును
చూచుకంబులు నల్లనయ్యె చూచుచుండ
మేనుదిక్కెను నడుమెంతొ మేటుయయ్యె
కనుల నెరుపెక్కె రతివాంఛ గలుగకుండె॥ ౩౧౩

గీ॥ కార్తికవ శక్షచంద్రుని గతిని వారి
ముఖము తెలుపెక్కె గనుగొన ముదముగొలిపె
చనుల కార్ష్య మలరెను జడత హెచ్చె
నాభి వికసించె మాంద్యంబు నడల గలిగె॥ 3౧౪

గీ॥ వళులు విరియంగ బాటెను నలతయలరె
నల్లనయ్యెను నూగారు నవ్యకాంతి
కలలు మంచివికశిగెను కాంతలకును
మనసుమిక్కిలి యానంద మహితమయ్యె॥ 3౧౫

క॥ వటపత్రంబును బోలిన
కుటిలాలక గర్భమిప్పుడు గురుభరయుతమై
వటపత్రమె యనబరగెను
వటపత్రమునందు బాలనాథుండునటచే॥ 3౧౬

గీ॥ కమలబాహుల బంధంబు గనినవాని
భక్తహృదయ బంధంబు బాయువాని
భామలప్పుడు సమగర్భ భవనమందు
బంధమొందింప బడసిరి భాగ్యవశత॥ 3౧౭

గీ॥ పుష్పగంధులు వెలసిరిపూర్ణగర్భ
భరితలై రమ్యకాంతిని భామలిప్పుడు
కలువపూతేని కడుపున నలరదాల్చి
మెఱయుప్రాచీదిశాంగన మెఱుపువెగడి॥ 3౧౮

క॥ నెలలు పదిరెండు జరిగిన
నలసటలుం గలిగెమిగుల నల వనితలకున్
విలసిల్లె కళలుమిక్కిలి
యలవడె నీళ్లాడునట్టిచుహాములు మిగులన్॥ 3౧౯

## శ్రీరామావతార ఘట్టము.

క॥ క్రతుపూర్తి యైనపిమ్మట
గతమయ్యెను ఋతువు లారుగనుగొను చుండన్
హితమగు పదిరెండవనెల
నతి నొందఁజేసి చైత్రశుక్ల నవమిని వేడ్కన్ ౩౨౦

గీ॥ అదితిభమునందు మధ్యాహ్నమైన తరిని
పంచఖగములు తమ యుచ్చభములనుండ
కర్కటాభిఖ్యరాశిని కమలనైరి
దేవగురువరుతో గూడి తేజరిలగ॥ ౩౨౧

క॥ సాయసమగు గ్రహ సంపద
శ్రేయముగా నుచ్చభముల జెలగుచు నుండన్
బాయకరము యురమున గల
మాయాజిత సర్వలోక మహితుడు బుట్టెన్॥ ౩౨౨

గీ॥ జగదధీశుని సర్వేశు చక్రహస్తు
సర్వలక్షణ సంయుక్తు చారువక్త్రు
దశరథానందకందుని దైత్యహరుని
యచ్యుతార్థాంశమగు వాని యమరవర్యు॥ ౩౨౩

గీ॥ అమిత తేజోభిరాముఁడై యలరు వాని
గన్న కౌసల్య మిసిమిగా కాంతి మిగిలి
యమరవరుడైన శక్రుని యాద్యవినుతు
వజ్రపాణిని గన్నట్టి వనిత వలెను॥ ౩౨౪

క॥ సకల జగత్పద్మంబులు
వికసింపగ జేయ నెంచి విష్ణాన్వీత్యుం
డకలంక కోసలాధిప
సకలార్థ సుతానుపూర్వ సంధ్యను బొడమెన్॥ ౩౨౫

గీ॥ సకల సద్గుణ ఖనికైక యమలగుణుని
కమల నయనుని సుముఖుని కాంతియుక్తు
జనమనోహరు లావణ్య సహిత దేహు
దీర్ఘబాహుని గనియెను ధీరు పీఠు॥ ౩౨౬

గీ॥ అలసుమిత్ర గనియెను హర్షయుతుల
యమళులను సర్వరిపు కులయముల ఘనుల
గనుల కానంద మొనగించు కాంతియుతుల
చారు లక్షణ యుక్తుల చంద్ర ముఖుల॥ ౩౨౭

సీ॥ మొలక నవ్వులతోడ వలరాజు వగతోడ
సలరాజు నవకంబు జెలువుతోడ
నరచందురుని బోలి యిరవొంది పసమించు
కమనీయ సత్వాల కలలతోడ
నల తమ్మిరేకుల కలకలనవ్వించు
గరువంబుగల సోగ కనులతోడ
తిల ప్రసూనమునుదిద్దగల తీరు గలిగిన
మురిపెంపు సిగల ముక్కుతోడ

గీ॥ గనుల కానంద మొసగించు కాంతితోడ
కలవ దొరసిగ్గు నిరసించు కలలతోడ
మెరయు పుత్రుని కౌసల్య మొగుసుబోడి
గనియె ప్రాకృతిచంద్రుని గనిన యటుల॥ ౩౨౮

సీ॥ సకలదిక్కులు సుప్రసన్నములయ్యెను
గంధర్వ గానంబుగలిగె దివిని
చలువనెత్తావుల సంచరించెనుగాలి
కుసుమవర్షంబులు గురిసెమింట

సురదుంధుభుల మ్రోతశుభరీల వినిపించె
జయ జయాయని దేవసంఘమునియె
బంగ త్రేతాగ్నులు ప్రజ్వరిల్లుచునుండె
సభలు సంతోషసక్తులైరి

గీ॥ కష్టచరితులు కష్టసంకలితులైరి
నానజక్కఁగ గురిసెను వసుధబండె
మనుజులెల్లరు సంతోషమున్నలై
బాలుపుత్రుని కౌసల్య భామగనగ॥ 3౨౯

గీ॥ పురముమిక్కిలి శోభిల్లె భూషసత్త
భూమిగోధన వస్త్రాధిక్య భూసురాళి
సరసచాతుర్య వాక్చర్య సాహచర్య
సంస్తవాంచిత మానవసత్తమలుచు॥ 3౩౦

గీ॥ ధరణిగలవారి గనువిచ్చిగెనటి
ధనముచేతను గసిసెను దశరథుండు
వీరువాసను భేదంబువిడిచి ధర్మ
సరణి దాటకసత్కారి సరణి...॥ 3౩౧

గీ॥ వాగగోచరమైనట్టి వైభవముఁ
కిర్ణమయంబులైనట్టి కల్పలలను
వీణాతంత్రుల ప్రోగ్గనువింతగాను
పాటపాడించిరింపుగా భవ్యులఘుడు॥ 33౨

గీ॥ ఉన్నతాలోక నాయాత ముప్ప్వజనము
పట్టణంబంతనిండిన భవ్యగరిమ
జెప్పశక్యంబుగాదట్లు చెలగిమిగుల
నినుకజల్లిన నిలబడదించుకైన॥ 333

నామకరణము.

గీ॥ పురుడు పదిరెండవదినములు బుచ్చినృపుఁడు
నామకరణోత్సవము జేసెనామమునను
రాముడనిబెట్టె జ్యేష్టుని రమ్యఘనుని
భరతనాముడు కైకేయి పట్టియయ్యె॥ 328

గీ॥ లక్ష్మణుండును శత్రుఘ్న లలితనామ
లనగనొప్పిరి సౌమిత్రుభార్యసుతులు
చాలయోచించి గురుడిట్లు సరసముగను
నామధేయంబు లొనరించె నన్యసరణి॥ 329

వ. వశిష్టమహర్షి సర్వజ్ఞుడగుట చాల యోచించి యీ నామం
బుల నుంచెను. సకలజన మనోభిరాముడగుటను సుగుణుల దృష్టిచిత్తము
లకు కూడ మోహకరమైన రూపము గలవాడగుటను. జ్యేష్టుని రాము
డనియు, రామ ప్రవాసకాలమున రాజ్యభార వాహకుడగుట భరతుడని
యు, కైంకర్య లక్ష్మీయుక్తుడగుట లక్ష్మణుడనియు, అంతశ్శత్రువులను
బాహ్యశత్రువులను జయించువాడగుట శత్రుఘ్నుడనియు నలుగురికి
నామధేయముల నొసగె.

చ॥ అరయగ దివ్యపాయస సమష్టము భాగముచేత బుట్టెనా
భరతుడు కేకయాత్మజకు భక్తుడు రామచతుర్థభాగుడై
పరగెను లక్ష్మణాహ్వయుడు పాయసమందు చతుర్థభాగుడై
వరలె సుమిత్ర గర్భమున వాని రామ సమాంశభాగుడై॥ 330

చ॥ భరతుని భాగతుల్యమగు భాగముచేత సుమిత్రమాసుతు
వరగుణి లక్ష్మణానుజుడు వైరికులాంతకు డవ్వలించెనా
భరతుడు పుష్యమీనముల బాయక బుట్టె సుమిత్రపుత్రులే
ధరణిని కర్కటోద్భవులు దాంతులు సప్రభజాతులిద్దరున్॥ 332

గీ॥ యమళుల సుమిత్రగనియె నయజ్ఞచరుల
లక్ష్మణాఖ్యుని శత్రుఘ్న లలితనాము
ప్రోష్టపద కాంతి యశస్సులు పుత్రులంద
రమలగుణ రూప లక్షణు లార్యనుతులు॥ 335

వ. అపుడు,

సీ॥ దివిజుల దిగులంత దీరెను దివిజారి
గుండెలు దడదడ గొట్టుకొనియె
విమలచిత్తుల మనస్తమము శాంతినిబొందె
దుష్టమనంబుల దుఃఖమొదవె
వసుధా చకోరాక్షి వగపులు దిగజారె
మునులకు మోదంబు మొలకలెత్తె
గ్రహములు నిజకాంతి కలితులై పరిపూర్ణ
బలముతో గూడిర భవ్యభముల

గీ॥ సకల జగముల కళ్యాణ సమితిగలిగె
నెలను రెండేసి వానలు నేలగురిసె
సాధుజనులకు సంతోష సమయమయ్యె
నంబుజాక్షుడు రాముడై యవతరింప॥ 336

వ. ఆసమయంబున,

సీ॥ దివిజుల నర్చించె ద్విజులకు ధనధాన్య
గోభూహిరణ్యాది కోటులిచ్చె
షడ్రసయుక్తమౌ సరసాన్నముల మెక్కి
"తృప్తాస్మ" యనిరంత ద్విజులుమిగుల
కామితంబుల నెల్ల కరుణలేసనకిచ్చె
సకలరాజేంద్రుల సత్కరించె

నింతుల నందర నింపుగ పూజించె
బాలుల సంతోషించె చెలువలలర

గీ॥ ధరణిగలవారి నందర దగినరీతి
ధనముచేతను దనిపెను దశరథుండు
వీరువారను భేదంబు విడిచి సకల
సరణిదాటక సత్కార సమితిచేసె॥ ౨౮౦

వ. అంత బాలుడు,

చ॥ పిడికిట నొక్కపెట్టునను పెట్టెడ రాముడు డీల్గుదానసే
కడువడి బాధలన్నియును గండడగుం భయమందకుండుడే
పిడికిలి జూడుమంచు గనుపెన్మిలి పల్కెడి రీతి నింపుగా
పిడికిలిబట్టి యూడు దనుపెద్దలు మెచ్చుచు జూచుచుండగన్॥ ౨౮౧

ఉ॥ నాయన! నన్నుతండ్రి రఘునాయక నిన్నుల మూయవేమిరా
నాయన! నిద్రపోర తనువా లుకొ తమ్ముడు నిద్రపోవగా
పాయక నాటలాడెదవు పంతమ! నీకు సదా వినిద్రతన్
మూయని వేయికంటిదొర ముగ్గులు యన్నను నిద్రపోయెడిన్॥ ౨౮౨

గీ॥ సుదతి యొక్కతె రాముని జూచి వేగ
పొత్తిగుడ్డలతో నెత్తి పొత్తి చనుల
ముద్దుపెట్టుచు నవ్వించి మునము లేప
నింతి కౌసల్య నీ భాగ్య మిదిగో యనియె॥ ౨౮౩

వ. మరియొకతె,

గీ॥ మంగళము రామరాఘవ మంగళంబు
మంగళము దశరథ సుత మంగళంబు
మంగళము దేవ సంస్తుత మంగళంబు
మంగళము లక్ష్మణాగ్రజ మంగళంబు॥ ౨౮౪

గీ॥ అలవశిష్ఠర్షి రాముని కలయఁగాంచి
దివ్యదృష్టిని గనినట్టి దివ్యమూర్తి
యితఁడె యని యెంచి తన భాగ్య మిట్టిదనుట
కద్భుతంబది హర్షించె నఖిల విభుఁడు॥ ౩౮౫

క॥ పౌరోహిత్యము జేయుట
సారాచారంబుగాదు సాధులకైనం
శ్రీరాముని సేవింపఁగ
పౌరోహిత్యంబు జేయ పాల్పడితినిగా॥ ౩౮౬

గీ॥ ఎపుడు కమలేశుఁ డీధాత్రి నేలఁదలఁచి
పూజ్య మనువంశమందున బుట్టుననుచు
దలఁపుగలిగెనో యప్పుడె దగనితుచ్ఛ
వృత్తినిటు చేయఁదలఁచితి బత్తిచేత॥ ౩౮౭

గీ॥ భక్తవరులను సేవించ భక్తిహృదయ
వర్తియగుహరి హర్షించు వాటమెఱిఁగి
గానభక్తులసారుల కలుషహరుల
సేవ జేయుచు గనుగొంటి శ్రీశునిటుల॥ ౩౮౮

వ. అని పరమసంతోష సాగర తరంగ డోలికల నూగుచున్న చిత్తంబుగలిగి యిహపరభాగ్యంబులన్నియు నీ తేజోమూర్తియేయని దలఁచి యనవరతావలోకన కుతూహలుండైయుండె. దశరథభూపాలుఁడును రామసౌందర్య విలోకనమున తృప్తినొందనివాఁడగుచు నెల్లప్పుడును పుత్రసాన్నిధ్యమునసే నివసించి యహంబుల క్షణంబులవలె బుచ్చుచుండె. రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నలుగురును చూపరులకానందమును గలిగించుచు దినదినాభివృద్ధినొందుచుండిరి.

సీ॥ శతకోటిబ్రహ్మాండ సందోహములనుండు
సకలలోకంబుల సర్వసురుల

విధిముఖాదుల దైత్యవిభులను మనుజుల
సర్వసత్వంబుల జడచయముల
సూర్యేందు ముఖ్యుల శుభలీలసృష్టించి
రక్షించి ద్రుంచెడి రమ్యమైన
తగనిజంజాటంబు తలదాల్చియాటల
మఱిగిన దనుజారిమాధవుండు

గీ॥ దశరథాత్మజుడై పుట్టి దల్లి మిగుల
ముద్దులాడగ నవ్వుచు మురిపెమునను
యాటపాటల నానంద మధికముగను
గలుగజేసెను గనుగొను కాంతలకును॥ ౩౮౯

వ. అంత క్రమక్రమముగ బాలులు వృద్ధిబొంది యాటపాటల కలరుచు నత్త, తాత, యక్కా, యను నవ్యక్త మధురపదంబుల నుచ్చరించుచు భూమియందు బ్రాకుచు గనుంగొనువారల నానందింప చేయుచుండిరి. అంత యారవ మాసమున యథావిధిగ నన్నప్రాశన మహోత్సవములు జరిపిరి. పిదపవారు తప్పటడుగులిడుచు నడుచుటయు క్రమంబుగ పరుగులిడి యాటలాడుట కారంభించుటయు గలిగెను.

ఉ॥ తమ్ములతోడగూడి తమతల్లులు జూడగ నాటలాడుచో
గ్రమ్ము శ్రమాంబు బిందువుల గప్పని చేలముచేత నొత్తియా
తమ్ముల లేని వంశజుని తద్దయురాముని బ్రాలుద్రావరా
రమ్మని తల్లి బిల్వగను రాముడు లక్ష్మణుజూపు వ్రేలితో॥ ౩౯౦

ఉ॥ తల్లిసుమిత్రలక్ష్మణుని తాంతముడస్సితి బాలుబ్రావరా
యుల్లము చల్లనౌనన నుత్సుకతం రఘురాముజూపుచుం
తల్లి నివ్రేలుబట్టి పెదతల్లిసమీపము జేర లాగగా
తల్లులునవ్విపుత్రులకు త్రాగగ స్తన్యము నిత్తురింపుగన్॥ ౩౯౧

ఉ॥ రాముడు బండునుయ్యాలకు రామలులక్ష్మణుడుండు నుయ్యాలన్
ప్రేమనుసోకునట్టులుగ బెట్టినహాయిగ నిద్రబోదు రా
రాములు దూరమందు నుప రాముడు నిద్దురబోడు లక్ష్మణుం
డామహనీయుచేరువర కద్భుతమై తగు బోరుబెట్టెడిన్॥ ౩౯౨

గీ॥ అట్లు శత్రుఘ్నుడు భరతుననుసరించు
పాలుద్రావెడి యప్పుడే పరమభక్తి
భరతుసేవ్పుడు శ్రీరామభక్తిభరితు
డగ్రజాజ్ఞానువర్తియై యలరుచుండు॥ ౩౯౩

గీ॥ భ్రాతలందరు సౌభ్రాతృభావమునను
తల్లిదండ్రుల గురువుల దగినరీతి
నుల్లసిల్లగ జేసిరి యుచితభంగి
గనులుగలవార లెల్లరు గనిరి ముదము॥ ౩౯౪

సీ॥ ఘల్లు ఘల్లుమని మ్రోయు గజ్జెలందెలు గల
పదకమలంబుల పరుగు విడగ
చంద్రబింబముతోడ సరిపోగు ముఖముల
చిరునవ్వు వెన్నెలల్బెలుగుచుండ
కమలదళంబుల కలకలనవ్వెడి
కమనీయ కనుదోయి కళలనీన
నవరత్నగుంభిత నవ్యముక్తాహార
ములు రొమ్ములను వింత మురువుగూర్ప

గీ॥ తమ్ములును రామచంద్రుడు తల్లులలర
పిల్లలందరతోగూడి వెల్లివిరియు
మొల్లమైనట్టి హర్షాబ్ధిమునిగిమిగుల
నుల్లసిల్లిరి యాటలనుత్సుకతను॥ ౩౯౫

చ|| పరిమళయుక్త తైలమున భాసురలీలను తల్లి మెల్లగా
శిరమున దేహమందునను చేతులనంటి జలంబుబోసి వే
వెరవగు ధూపసంగతిని వెంట్రుకలార్చియు వేణియల్లియున్
పరువగుసొమ్ము వెట్టియును పంపు నలంకృతదేహునాడగన్|| ౩౫౬

సీ|| పరమ మునీంద్రులు పరతత్త్వమనియెంచి
దమమానసంబుల దవిలికొలువ
రాజులు దనుజూచి రాజనీతియె యిట్లు
గలుగబోలు నటంచు దలచుచుండ
తల్లులు తండ్రియు దమ పూర్వభాగ్యంబె
దనయుడయ్యె నటంచు దలచుచుండ
ప్రజలెల్లరును జూచి ప్రభవించె మనువని
తమతమ మనముల దలచుచుండ

గీ|| మగువ లందరు మనమును ముసముసనగ
లక్షణజ్ఞులు లక్షణ లలితుడనగ
గనులకానంద మొనరింప గలిగినట్టి
చంద్ర సంకాశుడగు రామచంద్రుడలరె|| ౩౫౭

గీ|| అయ్యా! రామయ్యా! రావయ్యా! యనుచు తల్లి
పట్టకొనరాగ దొరకక పరుగులిడుచు
తల్లి యలసిన దరిజేరి తమ్ములకును
తల్లులను జూపు వ్రేలితో తల్లులలర|| ౩౫౮

గీ|| సకలకళ్యాణ గుణగణ సహితుడైన
రామచంద్రుని చంద్రుని రాక నిశిని
గనులు గలవారు గన్నుల గాంచిమురిసి
సమ రసంబైన ప్రీతిని జాలగనిరి|| ౩౫౯

వ. విద్యాభ్యాసమునకు తగినవయోవిశేషమంకురించుట తోడనే దశరథరాజేంద్రుడు వశిష్టానుమతంబున తగిన గురువుల సన్నిధానమున విద్యలనెల్ల చదివించెను. బాలురు నలుగురు సకలవిద్యల యందును శస్త్రాస్త్రవిద్యలయందును హయారోహణ, గజారోహణాదుల యందును, మల్లవిద్యా విశేషంబులను, యసదృశ శక్తిసంపన్నులై తమగురువుల కానందంబు గలిగించుచుండిరని కుశలవులు వినిపించిరి.

క॥ మందార మాలికాధర
సుందాసుర తనయకాల సురముని వినుతా
బృందారక సంసేవిత
వందారు జనేష్టదాన వాసవవంద్యా॥ 3౬౭

క॥ విశ్వేశ్వర విశ్వాత్మక
విశ్వోదర విశ్వవినుత విశ్వాధారా
విశ్వగత విశ్వరూపక
విశ్వాతిగ విశ్వసర్గ విలయస్థేమా॥ 3౬౮

పంచచామరము. సరోజపత్ర నేత్రరాక్షసాళి మానఖండనా
పరాత్పరా మహానుభావ భానువంశ శేఖరా
విరోధి మత్తదంతి సింహ వీరలోక సన్నుతా
పరాకు రే. సన్ను గావు భానుపుత్ర వందితా॥ 3౬౯

మాలినీవృత్తము. జనిత సుజనలోకా శాసితానేకధర్మా
కమల సదృశ నేత్రా కామ సంకాశరూపా
నమిత సకలభూపా నవ్యపీయూషనామా
శమదమ గుణభూషా శాంతపాపప్రసేవ్యా॥ 3౭౦

శా॥ లోకాతీత గుణాభిరాముడు రమాలోలుండు రామప్రభుం
డీకళ్యాణ కృతీశ్వరుం డజముఖాభీష్టార్థదుం డాఘహృదుఁ
శ్రీకళ్యాణ సుఖంబు లిచ్చి మనుచుం చేతోముదంబొప్పగా
నీకావ్యంబు రవిందు తారకలతో నింపొందు భద్రంబుగన్॥ ౨౬౮

మ॥ ఇదిరామానుజ యోగిరాజ కథితాభీష్టార్థ తత్త్వజ్ఞతా
పదవిభ్రాజితు యజ్ఞమూర్తిని మది న్భావించి స్వీయాన్వయు
న్ముదమొప్పారగ రాముతమ్మునికథ న్మెచ్చాఫలాభంబుగా
సదయుల్మెచ్చ వచించితి న్మొదటిదౌ యాశ్వాసంబు రామ ప్రభో॥

గద్య

ఇది శ్రీమద్భగవద్రామానుజ కరుణాకటాక్ష పాత్ర యజ్ఞార్య పవిత్రవంశ్య
చతుస్సప్తతి పీఠాంతర్గత తకీయపీఠాధిష్ఠిత భారద్వాజస గోత్ర
పవిత్ర తిరుమలై యచ్చాన్ కాంతూరు రాఘునాచార్య
దేశిక వేంకటాంబా పుత్ర విబుధజనవినయ చర్య
వేంకట తిరుమలాచార్య ప్రణీతంబగు
భరత చరిత్రంబను మహాప్రబంధము
నందు ప్రథమాశ్వాసము
సంపూర్ణము. శుభం
భూయాత్ ॥
శ్రీ శ్రీ శ్రీ



# ప్రథమాశ్వాసమునకు ధనప్రదులు.



మ॥ రా॥ శ్రీ 1. రావుసాహెబు కోట్ల సన్యాసయ్యనాయుడుగారు దుమ్మగూడెం.
,, 2. సోమరాజు పురుషోత్తమదాసుగారు
,, 3. వారుపుల అప్పలస్వామిగారు
,, 4. చెలికాని రంగయ్యారావుగారు యడవల్లి మొఖాసా.
,, 5. వల్లూరి లక్ష్మయ్యగారు
,, 6. గూడూరు మల్లిఖార్జునుడుగారు వంగూరు.
,, 7. పూళ్ళ శేషగిరిరావుగారు
,, 8. మొగళ్ల సుబ్బారావుగారు
,, 9. కొత్త సెరుమాళ్లయ్యగారు అంకనగూడెం.
,, 10 యీ రామయ్యగారు
,, 11. యీ వెంకటరంగయ్యగారు
,, 12. ముప్పాళ రంగయ్యగారు
,, 13. మానిళ్లపల్లి సుబ్బయ్యగారు
,, 14. వాడపల్లి భీమయ్యగారు
,, 15. మొరవినేని వెంకటనరసయ్యగారు
,, 16. యీ వెంకటప్పయ్యగారు
,, 17. యీ వెంకమ్మగారు
,, 18. యీ వెంకటాద్రియ్యగారు కొత్తపూరు.
,, 19. యీ సూరయ్యగారు
,, 20. యీ గోవిందయ్యగారు
,, 21. యీ సుబ్బయ్యగారు
,, 22. యీ జగ్గమ్మగారు

,, 23. పెదమాక లక్ష్మీనారాయణరావుగారు,
సూదాపూండి.

,, 24. వీరప్రతాప సూర్యరాజుగారు తాలూకాదారు
రాఘవపురం.

,, 25. జూపల్లె ధర్మలింగయ్యగారు అశ్వారావుపేట.

,, 26. యీ సీతారామారావుగారు

,, 27. యీ దాసయ్యగారు పొట్టినారిగూడెం.

,, 28. చెలికాని సూర్యారావుగారు

,, 29. ఆత్మకూరి నాగరత్నంగారు నాగులవంచ.

,, 30. యీ కృష్ణయ్యగారు

,, 31. యీ నాగయ్యగారు

,, 32. యీ సీతయ్యగారు

,, 33. యీ చినకృష్ణయ్యగారు

,, 34 తేలుకుంట కృష్ణయ్యగారు

,, 35. యీ జగన్నాథంగారు

,, 36. చల్లా శేషయ్యగారు

,, 37. రాయపురి వెంకయ్యగారు

,, 38. యిమ్మడిశెట్టి కృష్ణయ్యగారు

,, 39. యీ పిచ్చయ్యగారు

,, 40. తేలుకుంట నారాయణగారు బొగ్గుగుంట.

,, 41. మాజేటి వరదయ్యగారు దొండపాడు

,, 42. యన్నాకుల ఆంజనేయులుగారు జగ్గయ్యపేట.

,, 43. గోరుగుంట్ల మహాలచ్చయ్య బ్రదర్సుగారు లింగాల.